# హఠాత్తుగా పతనమైన బొంబాయి ఇళ్ల ధరలు!

బొంబాయిలో రియల్ ఎస్టేట్ ధరలు హఠాత్తుగా పడిపోవటం అందర్నీ ఆశ్చర్య పరుస్తున్నది. ప్రపంచంలో అత్యధిక రియల్ ఎస్టేట్ ధరలు కలిగిన నగరంగా బొంబాయికి ఇటీవలనే గుర్తింపు లభించడం ఇక్కడ గమనార్హం. ఆర్థిక సంస్కరణలకు ఆకర్షింపబడి భారత దేశంలో పరిశ్రమలు స్థాపించ డానికి ఇండియాకు వచ్చిన పాశ్చాత్యులు బొంబాయి నగరంలో ఇళ్లు, ఆఫీసు భవనాల ధరలు చూసి బిత్తర పోయారు. జూహూ బీచ్, కొలాబా వంటి ప్రాంతాలలో మూడు బెడ్ రూములు కల్గిన చిన్న అపార్ట్మెంట్ రెండు నుంచి ఐదు కోట్ల రూపాయల ధర పల్కేది. నారిమన్ పాయింట్ వంటి కూడలి ప్రదేశాలలో ఆఫీసు గదులు ఒక చదరపు అడుగు యాభై వేల వరకు విక్రయింప బడినాయి. అంటే వెయ్యి చదరపు అడుగుల హాలు 5 కోట్లన్నమాట. ఈ రేట్లు చూస్తే పాశ్చాత్యులకే గుడ్లు తిరిగాయంటే, ఇక భారతీయ పారిశ్రామిక వేత్తల పరిస్థితి ఆలోచించనే అవసరం లేదు. గత నాలుగేళ్లుగా సంభవించింది అధిక ధరల పరిణామం.

వాటి పట్ల ఆకర్షింప బడిన రిలయన్స్, మహీంద్ర, లాయడ్స్, వీడియోకాన్, ఎస్సార్ వంటి పారిశ్రామిక సంస్థలు అపార్ట్మెంట్లు, ఆఫీసు కాంప్లెక్స్లు నిర్మించే వ్యాపారానికి శ్రీకారం చుట్టాయి. నిర్మాణ రంగంలోకి కొన్ని వందల కోట్ల రూపాయల డబ్బు పెట్టుబడి క్రింద తరలి వెళ్లింది. అయితే పరిస్థితిలో హఠాత్తుగా మార్పు రావడంతో వీరంతా దిక్కు తోచక నిలబడి పోయారు. గత కొద్ది నెలల్లోనే రియల్ ఎస్టేట్ ధరలు 30 శాతంకు పైగా పడిపోయాయి. అంటే ఐదు కోట్ల ఆఫీసు గది విలువ మూడున్నర కోట్లకు

> **హైదరాబాదు, బెంగుళూరులకూ త్వరలో ఇదే పతనావస?**

పడిపోయిందన్న మాట. న్యూ బొంబాయి ప్రాంతంలో ఎంతో ఆధునికంగా, అందంగా కట్టిన ఇరవై ఐదు లక్షల చదరపు అడుగుల ఆఫీసు కాంప్లెక్స్లు కొనుగోలు దారులు లేక ఖాళీగా వున్నాయి. కొత్తగా నిర్మాణ రంగంలోకి వచ్చిన వారు కోలుకోలేని రీతిలో దెబ్బతిన్నారు. పెట్టుబడికి కనీసం 60 శాతం ఆదాయం వస్తుందని వీరందరూ ఈ రంగంలోకి వచ్చారు. కాని అసలే తలక్రిందులయ్యే పరిస్థితులు ఏర్పడినాయి. దీని ఫలితంగా పలు కంపెనీలు డబ్బు కొరతను ఎదుర్కొంటున్నాయి. ఇంటర్ కార్పొరేట్ డిపాజిట్ల మీద వడ్డీ రేటు 24 శాతం వరకు పెరిగి పోయింది.

వీడియోకాన్ కంపెనీ తమ నిర్మాణం పూర్తి చేయలేక మధ్యలోనే వేరే కంపెనీకి ఆ ఆస్తిని విక్రయం చేసింది. రిలయన్స్ వాళ్లు అసలు కట్టడమే మొదలు పెట్టక చాలా స్థలాలు ఖాళీగా పెట్టికారు. తమ స్వంత ఫ్యాక్టరీ స్థలాలలో భవనాలు నిర్మించిన బాంబే డైయింగ్, మొరార్జీ మిల్స్ వాళ్లు మాత్రం పెద్దగా నష్టపోకుండా బయట పడ్డారు. స్థలం కొనుగోలులో పెట్టుబడి లేదు కాబట్టి వారు నిలదొక్కు కోగల్గారు.

బొంబాయి రియల్ ఎస్టేట్ రంగంలో మిట్టల్స్, రహేజాలు, లోఖండే వాలా గ్రూపులు బాగా స్థిరపడి వున్నాయి. వారీ రంగంలో ఇప్పటికే బాగా లాభాలార్జించారు. ఈ ధరల పతనం వల్ల వారు పెద్దగా నష్ట పోనప్పటికీ, నిర్మాణ రంగం కంటే హోటళ్లు, రిసార్ట్లు, ఇతర వ్యాపారాల పై దృష్టి మళ్లిస్తున్నారు.

బొంబాయి రియల్ ఎస్టేట్ ధరల పతనపు ప్రభావం హైదరాబాదు, బెంగుళూరు వంటి దక్షిణాది నగరాలకూ వ్యాపిస్తుంది. బొంబాయిలో ఇళ్లు, అపార్ట్మెంట్లు అమ్మి ఈ నగరాలలో కొనడం మొదలు పెట్టడం వలనే ఇక్కడ ధరలు పెరిగాయి.

# న్యూస్ప్రింట్ పబ్లిక్ ఇష్యూ బోల్తా కొట్టింది!

ఎంతో ప్రచారార్భాటంతో పబ్లిక్ ఇష్యూకు వచ్చిన ప్రభుత్వ రంగంలోని తమిళనాడు న్యూస్ ప్రింట్ అండ్ పేపర్ మిల్స్ లిమిటెడ్ కంపెనీ కష్టాలలో పడిపోయింది. రు. 100ల ప్రీమియంతో 220 కోట్ల రూపాయలకు వారు విడుదల చేసిన షేర్ ఫెయిల్ అయింది. క్లోజింగ్ తేదికి ఇష్యూ మొత్తంలో 30 శాతం కూడా సబ్స్క్రయిబ్ కాలేదు. కనీసం డిసెంబరు 7 తేది నాటికైనా వారు 90 శాతం మొత్తం సబ్స్క్రయిబ్ చేయించాలి. పబ్లిక్ ఇష్యూ మేనేజర్లు ఈ ఇష్యూను నిలబెట్టడం కోసం విశ్వప్రయత్నం చేస్తున్నారు. వారు అందులో సఫలీ కృతులు కాకపోతే ఇష్యూ రద్దయి పోతుంది. ఇన్వెస్టర్లు కట్టిన కొద్ది డబ్బు కూడా వాపసు చేయవలసిందే.

ఎంత మంచి పేపరు మిల్లు అయినా ప్రభుత్వ రంగంలో వున్న పరిశ్రమకు రు. 100 ల ప్రీమియం చెల్లించడానికి ఇన్వెస్టర్లు సిద్ధపడరు. ఈ సూక్ష్మం గ్రహించ లేక షేర్ మార్కెట్ను తప్పుగా అంచనా వేసి బోల్తా పడ్డారు.

## మాక్స్వర్త్ కంట్రీ

మాక్స్వర్త్ కంట్రీ ఇండియా లిమిటెడ్ డిసెంబరు 15 తేది పబ్లిక్ ఇష్యూకు వస్తున్నది. షేర్ ముఖ విలువ రు. 10లు. ఈ మధ్యనే ఇదే ప్రమోటర్లు మాక్స్వర్త్ ఆర్చిడ్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్ అనే కంపెనీ పేరుతో ఒక పబ్లిక్ ఇష్యూ విడుదల చేసి వున్నారు. ఫార్మ్ అస్తులు, హౌసింగ్ హోంలు, హార్టి కల్చర్ తదితర పనులు చేస్తామని చెప్పారు. అయితే వారు హామీ ఇచ్చిన ప్రకారం ఆ కంపెనీ పేరుతో 1500 ఎకరాల భూమి కొనడం జరగ లేదు. ఇంకా కొరవ వుంది. అందువల్ల ప్రాజెక్టు చెప్పిన సమయానికి పూర్తి కావడం అసాధ్యం. దాన్నట్లా అసంపూర్తిగా వుంచి, అప్పుడే కొత్త ప్రాజెక్టును విడుదల చేస్తున్నారు. పబ్లిక్ ఇష్యూ నిధులను జవురు కోవడానికి ఏదో ఒక పేరుతో ఇష్యూలు విడుదల చేయడమే

**డాక్టర్ ఎ. దుర్గాప్రసాద్.**

కొందరికి ఒక వ్యాపారంగా మారుతూ వుంది. స్టెర్లింగ్ హాలిడే రిసార్ట్స్ కంపెనీ కూడా ఇదే పద్ధతులను పాటిస్తున్నది.

అయితే మాక్స్వర్త్ ప్రారంభించిన ప్రాజెక్టు మంచిది. ప్రమోటర్లకు ఆ రంగంలో అనుభవం వుంది. ఆ దృష్టితో చూసినప్పుడు ఈ షేర్కు దరఖాస్తు చేయడంలో తప్పులేదు. నష్టం రాదు.

## వైశ్యాబ్యాంకు రైట్స్ ఇష్యూ

ఎట్టకేలకు వైశ్యా బ్యాంకు తన రైట్స్ ఇష్యూకు రిజర్వు బ్యాంకు అనుమతి పొందింది. రెండేళ్ల నుంచి

కొరవ 18 పేజీలో

# పోకిరీతనం!

అభ్యంతరకర వివాదాలు అచ్చు గుద్దిన నల్ల చొక్కాలు ధరింప జేసి, తన ఎమ్మెల్యేలను అసెంబ్లీకి పంపడం ద్వారా మాజీ ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు పోకిరి పిల్లవాని వలె వ్యవహ రించారు. అధికారం చేజారిందన్న దుగ్ధతో విచక్షణ మరచి పోయి ప్రవర్తించడం ఆయనకు అలవాటై పోయింది.

శాసన సభలకు ఒక హుందా తనం, గౌరవం వున్నాయి. ప్రభుత్వం పై విమర్శలు సంధించ దానికి, ప్రభుత్వ విధానాల పై నిరసన తెల్పడానికి శాసన సభను వేదిక చేసు కోవడంలో తప్పు లేదు. కాని, పార్టీ పరమైన రాజకీయ రచ్చలు, రావిళ్లు, వివాదాలు, చిలికలు, వ్యక్తిగత తిట్లు, శాపనార్థాలకు అసెంబ్లీని వేదిక చేసుకొని వీరంగాలాడడం సత్సాంప్రదాయం కాదు. చంద్రబాబు నాయుడు తన చేతిలోని అధికారం అన్యాయంగా, అక్రమంగా పెరుక్కొని పోయాడన్న ఆక్రోశం, కడుపు మంట ఎన్‌టి రామారావులో వుంటే వుండవచ్చు. వాటిని వ్యక్తం చేయడానికి, తిరిగి తన పెత్తనాన్ని సాధించు కోవడానికి ఆయనకు చాలా మార్గా లున్నాయి. ప్రజల సహకారంతో ఉద్యమం నడిపో, ఎన్నికలలో ఓడించడం ద్వారా నైతిక పరమైన ఒత్తిడి తెచ్చో, తనను వదలి వెళ్లి పోయిన ఎమ్మెల్యేలను ప్రాధేయపడి, పాదాలు పట్టి తిరిగి తన శిబిరానికి తెచ్చుకునో ఎన్‌టిఆర్ చంద్రబాబును దించేయడానికి పోరాటం సల్పవచ్చు. అంతే తప్ప అసలే అంతంత మాత్రంగా జరుగుతున్న అసెంబ్లీని తమ పార్టీ రచ్చలకు, వ్యక్తిగత దూషణలకు రంగ స్థలంగా మార్చి, పోకిరీ చేష్టలు చేయడం దుర్మార్గం; సహించరాని విషయం. ఇది జరిగిన ప్రక్క రోజు నడివీధిలో తన ఎమ్మెల్యేల చేత పోటీ అసెంబ్లీ నడి[illegible]చి శాసన సభ హుందా తనాన్ని మరింత భ్రష్టు పట్టించారు. స్పీకర్ ఇంటి పైకి రౌడీ మూకలను పంపి దౌర్జన్యానికి సంకల్పించారు. ఏమిటీ ఆకతాయి తనం?

చంద్రబాబు ప్రభుత్వం రాజ్యాంగ బద్ధంగా ఏర్పడినది. ఆయనకు అత్యధిక సంఖ్యలో ఎమ్మెల్యేల మెజారిటీ వుంది. ఎన్నికైన కాల పరిమితి గడువులో, మెజారిటీ శాసన సభ్యుల మద్దతు కల్గిన ప్రభుత్వాన్ని దించి వేయడానికి ఎవరికీ అధికారం లేదు. ఈ నిజం గ్రహించి తమకు మిగిలిన కొద్ది మంది శాసన సభ్యుల ద్వారా ప్రభుత్వ విధానాల లోప భూయిష్టతను తూర్పార బట్టి, ప్రజలలో చైతన్యం తేవడం ఒక్కటే చేయదగిన, చేయ వలసిన పని! శాసన సభ లోపల చర్చలు, ఉపన్యాసాల ద్వారా ప్రభుత్వాన్ని ఎదుర్కోలేని తమ బలహీనతను కప్పి పెట్టుకోవడానికే ఎన్‌టి రామారావు ఈ అకృత్యాలకు దిగుతున్నట్లు కన్పిస్తోంది. ఏది ఏమైనా నిన్నటి వరకు నువ్వు [illegible]గ బెట్టిందేమిటన్న ప్రశ్న తిరిగి [illegible]నే ఇరకాటంలో పెడుతుందన్న [illegible]ంతో, ఏదో ఒక సాకు వెతికి, అల్లరి సృష్టించి, సస్పెన్షన్ చేయించుకొని బయటకు వచ్చేస్తున్నారు ఎన్టీఆర్ తెలుగు ఎమ్మెల్యేలు. లోపలే వుండి ఓటింగ్ సమయాలలో విప్ ధిక్కరించ వలసిన పరిస్థితి ఎదురైతే పార్టీ ఫిరాయింపు చట్టం చట్రంలో ఇరుక్కొని పోయి తమ పదువు లెక్కడ పోతాయో నన్న భయంతో వారీ చవక బారు ఎత్తుగడలు అవలం బిస్తున్నారు. శాసన సభ లోపల ప్రజా సమస్యలు చర్చించేందుకు సిద్ధపడ[illegible] వారు శాసన సభ్యులుగా వుండడానికి అర్హులు కాదు. ప్రజా స్వామ్యం పై విశ్వాసం వుంటే వారు ఈ గారడీ విద్యలు మాని సక్రమంగా హాజరన్నా కావాలి; లేదా శాసన సభ్యత్వాలకు రాజీనామా చేసి ఎన్నికల యుద్ధ భేరి మ్రోగించాలి.

ఈ ఒక్క విషయంలోనే కాదు - అధికారం పోయినప్పటి నుంచీ రామారావు గారి ప్రవర్తన, ప్రకటనలు విడ్డూరంగా వుంటున్నాయి. రోజుకొక రకం పత్రికా ప్రకటనతో జోకర్ వలె వ్యవహ రిస్తున్నారు. అధికారం లేకుండా తాను బ్రతక లేనన్నట్లు ప్రవర్తిస్తున్నా[illegible]రు. లక్ష్మిపార్వతి విషయంలో తన బలహీనతలను ఏ మాత్రం దాచు కోలేక పోతున్నారు.

**జమీన్‌రైతు**

తెలుగు దేశం అధికారంలోకి వచ్చిన రోజు నుంచీ ఇదే చీకాకు. ఆంధ్ర ప్రభుత్వం, తెలుగు ప్రజలు తమ కుటుంబ ఆస్తి అయినట్లు ఎన్టీఆర్, ఆయన భార్య, అల్లుళ్లు, కొడుకులు, కూతుళ్లు వ్యవహ రిస్తున్నారు. ఇంటి రచ్చలు వీధికెక్కించి రోత సృష్టిస్తున్నారు. ఎక్కడిదీ సాంప్రదాయం? ఎందుకు సహించాలి వీటిని మనం?

ఒకవైపు ఖాళీ అయిన ఖజానా, ఇంకొక వైపు కరెంట్ నతతో [illegible] చీకటి బ్రతుకు, అభివృద్ధికి ఆస్కారమే లేని అయోమయ స్థితి, భయ పెడుతున్న కరువు, కాటకాలు, పెరిగి పోతున్న నక్సలైట్ల దురంతాలు, అదుపు తప్పుతున్న శాంతి భద్రతలు, అధికార యంత్రాంగంలో అవినీతి వికటాట్ట హాసం వంటి సవాలక్ష సమస్యలతో సతమత మౌతున్న ఆంధ్ర రాష్ట్రం ఒక ఇంటి తగువులకు అన్యాయమై పోవడం క్షమించరాని విషయం. ఓట్లేసి పరిపాలించమని గద్దె నెక్కిస్తే దొంగలు దొంగలు వూళ్లు పంచుకున్నట్లు రాష్ట్రాన్ని దోచు కోవాలని, అధికారం నంజు కోవాలని ఆరాట పడ్తున్నారు ఎన్టీఆర్ కుటుంబీకులు.

ఇటువంటి రాజకీయ పోకడలను నిర్దాక్షిణ్యంగా, నిర్మొగ మాటంగా ఖండించ వలసిన బాధ్యత అందరి పైనా వుంది. రానున్న ఎన్నికల్లోనైనా తెలుగు ప్రజలు ఈ వంటింటి రాజకీయ వారులకు బుద్ధి చెప్పు గల్గితే రాష్ట్రం పరువు నిలుస్తుంది.

---

**జమీన్‌రైతు**

8.12.1945

వెల: 0-1-6 పేజీలు:8

## నెల్లూరుముచ్చట్లు

### అవును తుపాకితో

ట్రెయినింగు స్కూల్ డ్రిల్ టీచరు తూపిలి అంబ్రూస్ అనే చదువు కున్న క్రైస్తవ భక్తుడు కొండ్లపూడి అడవిలో మేస్తున్న ఇందూరు పట్టాభి రామిరెడ్డి గారి తాలూకా మూంచి అవును 1 తేది తుపాకితో కాల్చి చంపి కళేబరాన్ని నెల్లూరు కబాడి పాళెం తెచ్చి రు 16 లకు అమ్మినారట. ఈ సందర్భంలో తూపిలి అంబ్రూస్, ఇంగిరాల దేవదాసు, పాలగిరి కోటయ్య యీ ముగ్గుర్ని రూరల్ పోలీసు అరెస్టు చేసింది. కొండ్లపూడి కొప్పోలు రాముడనే వాడు పరారీ-

### రీడింగు రూంలో చీట్లాట

నెల్లూరు రీడింగు రూమనేది కాలేజికి ఎదుట వుంది. పెద్ద మనుష్యులనే వారు అక్కడ చేరతారని ప్రతీతి. త్రాగుడు, జూదము, అక్కడకు పోవడానికి భయపడేవి. నేడు జూదంగారు ప్రవేసించారు. పెద్దలకు కంటకంగా వుంది. మంచి మాటలు చెప్పి ఆ దేవతను సాగనంపడం యోగ్యతగా వుంటుంది. ఇది నా మాటే గాదు, అక్కడకొచ్చే పెద్దలందరి అభిప్రాయం గూడా.

### కాంగ్రేసు సభ్యులు

అల్లూరు మాజీ పోలీసు మిత్ర [illegible]య్య, పొదిలి మాజీ రాజా మిత్ర [illegible]ర్పయ్య, కాంగ్రేసు సభ్యు లైనారనీ, చేర్పిస్తున్నారనీ కంప్లైంటు. అలాంటి చరిత్ర కారులు కాంగ్రేసులో చేరడం మంచిదే కదా. కడప సి.ఎల్. నరసింహా రెడ్డి ప్రభృతులంతా కాంగ్రేసులో చేరారు గదా. అయితే ఇట్టి వారిని త్యాగ[illegible] గుండంలో కాల్చనిదే అధికార పదవు లివ్వడం తగదు. కాని సభ్యులుగా చేరినందుకు సంతోషమే. గోయిందయ్యను, రామ చంద్రయ్యను గూడా చేరమనే నేను ప్రార్థిస్తున్నాను.

### కాంగ్రేసు మీటింగు

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

నెల్లూరు జిల్లా కాంగ్రేసు వర్కింగు కమిటీ 6 తేది కావలిలో జరిగింది. జమీన్‌రైతు వర్గాన్ని మాత్రమే అంటే జగన్నాథం, సిన్హా, రామా నాయుణ్ణి మాత్రం కమ్యూనిస్టు తంత్రజ్ఞుల ఆజ్ఞ ప్రకారం బహిష్కరించి జిల్లాలో మారు మూలలనున్న యితరులను గూడా చాలా మందిని ఆహ్వానించారు. జిల్లా, తాలూకా కమిటీలకు ప్రత్యక్ష ఎన్నిక లుండాలనీ, రాష్ట్ర సభకు పరోక్ష ఎన్నిక లుండాలనీ నిబంధనలకు సవరణలు సూచించారు.

కొరవ 18 పేజీలో

---

# ఆయన పేరుతో ఆస్పత్రి కట్టించండి!

స్వర్గీయ మాగుంట సుబ్బరామి రెడ్డి రాజకీయాల్లో ప్రవేశించి ఐదు సంవత్సరాలే అయినా, 50 సంవత్సరాలుగా రాజకీయాల్లో వున్న [illegible] నాయకులు సైతం సంపాదించలేని పేరు ప్రఖ్యాతులు పొందారు. పారిశ్రామికవేత్తగా, దాన కర్ణునిగా, రాజకీయ రంగంలో అజాత శత్రువుగా జిల్లా స్థాయి నుండి రాష్ట్ర స్థాయికి ఎదిగారు. తిరుపతిలో కాంగ్రెస్ ప్లీనరీ సమావేశాల నిర్వహణ బాధ్యతను తన భుజస్కందాల పై వేసుకొని నభూతో

నభవిష్యతి అన్నట్లు నిర్వహించి దేశ వ్యాప్తంగా సుబ్బరామ రెడ్డి తన సత్తాను చాటి చెప్పారు. ఒంగోలు పార్లమెంటు సభ్యుడయ్యాక ఆ నియోజక వర్గంలో ఎన్నో గ్రామాల దాహార్తి తన స్వంత డబ్బులు ఖర్చు పెట్టి తీర్చారు. కాలేజిలు, పరిశ్రమలు పెట్టి ఎందరో నిరుద్యోగులకు చేయూతగా నిల్చారు. అడిగిన వారికి లేదన కుండానే సహాయం చేసే మహాను భావుడిగా ఆయన పేరు కలకాలం ప్రజల హృదయాల్లో వుండి తీరుతుంది. భావి తరాలుగా కూడా ఆయన పేరు

కూడా గుర్తుంచు కొనేలా ఆత్మకూరులో సుబ్బరామ రెడ్డి గారు స్వయంగా చేసిన వాగ్దానం ప్రకారం నెల్లూరు ప్రజలకు అందుబాటులో వుండేలా సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రిని ఆయన కుటుంబ సభ్యులు నెరవేర్చితే బాగుంటుంది.

గూడూరు -అవుల కొండయ్య

### సహృదయుడు సుబ్బరామరెడ్డి

మనసున్న మహా మనిషి మాగుంట సుబ్బరామ రెడ్డి! పిడుగు వంటి మరణ వార్త దిగ్భ్రాంతిని కలుగ జేసింది. ఉపకారమే కాని అపకారం ఎరుగని సహృదయుడు ఆయన. ప్రజల దాహార్తిని తీర్చిన సజ్జనుడు ఆయన.

## జనవాణి

దేశంలో కోట్లకు పడగలెత్తిన వారు ఎందరున్నా, త్యాగ బుద్ధి అందరికీ ఉండదు. కోట్ల రూపాయలకు అధిపతి అయినా త్యాగ గుణం కలవాడు. కళాశాలలు స్థాపించి ఎందరో విజ్ఞాన వంతు లయ్యేందుకు సాయపడ్డారు. ధనిక, బీద భావం లేక అందరినీ చి[illegible]నవ్వుతో పలుకరించే [illegible]రాడంబరుడు ఆయన ఇక లేరన్న విషయం జీర్ణించు లేక పోతున్నాను.

నెల్లూరు -వాకాటి పెంచలురెడ్డి

### మాగుంటను హత్యచేయను చేతులెలా వచ్చాయి?

ప్రజాబంధు, అజాత శత్రువు, దానశీలి, ప్రేమ పాత్రుడు మాగుంట సుబ్బరామ రెడ్డిని కిరాతకంగా హత్య చేయడానికి నక్సలైట్లకు చేతులెలా వచ్చాయో అర్థం కావడం లేదు. చీమకు కూడా అపకారం చేయని తత్వం ఆయనది. ఆయన చేసిన దానాలను వెలకట్టడం సాహసమే అవుతుంది. సుబ్బరామ రెడ్డి పట్ల నిగూఢంగా వున్న [illegible]జాభిమానం అంతిమ యాత్రలో [illegible]ట మయ్యింది. ఏది ఏమైనా మాగుంట మరణం జిల్లా అభివృద్ధికి గొడ్డలి పెట్టు.

నెల్లూరు -పి.జితేంద్రనాథ్‌బాబు

కొరవ 18 పేజీలో

---

# జనమానసాలలో చిరంజీవి!



వ్యాపారం చేసినా,
పరిశ్రమలు నడిపినా
రాజకీయ నాయకత్వం వహించినా
ఎదురులేని విజయపరంపరలతో
ఎవరెరుగని జనాదరణతో
తేజోమయ జీవితం గడిపిన

## మాగుంట సుబ్బరామరెడ్డి గారు

మరణంలోనూ తన ఔన్నత్యం నిల్పుకొని
అశేష ప్రజావాహిని కంట తడి తెప్పించి
హఠాత్తుగా అంతర్ధానమైపోయారు.
ఆయన జీవనం ఘనం; మరణమూ ఘనతరం
జనమానసాలలో ఆయన చిరంజీవి!
ఆ మహావ్యక్తి స్మృతికి
చెమర్చిన కన్నులతో అంజలి ఘటిస్తున్నాను

కె.వి.ఆర్. చంద్రయ్య
(కలవకూరు చంద్రశేఖర రెడ్డి)
నెల్లూరు

# మాగుంటకు నివాళి - వారి కుటుంబానికి సానుభూతి!



వయస్సులో చిన్నైనా, మనస్సులో పెద్ద,
ఎంతో మందికి ఎన్నో రంగాలలో స్ఫూర్తినిచ్చిన

## మాగుంట సుబ్బరామరెడ్డి గారి

అకాలమరణం మాకు తీరని లోటు
వారికి నివాళి అర్పిస్తూ వారి కుటుంబానికి
మా సానుభూతిని తెలుపుకొంటున్నాము

ఊటుకూరు బ్రహ్మారెడ్డి

**హోటల్ సూర్య ఇంటర్నేషనల్**
ఎస్.వి.ఎస్. కాంప్లెక్స్, నెహ్రూబొమ్మ వద్ద, నెల్లూరు - 524 003.
ఫోన్స్: 29161, 27177, 27178, 27179

## రైతుల కొంప ముంచబోతున్నారు!

# డెల్టాలో పైర్లకు నీళ్లు సందేహమే!

జిల్లాలో ఆశించినంత మేర నవంబరు నెలలో వర్షాలు పడకపోవడ్డ పాకుతో సీజన్ ప్రారంభం నుండే వ్యవసాయ పనులకు నీటిని సరఫరా చేయక పోవడం వల్ల రైతులలో ఇప్పటికే ఆందోళన నెలకొని వుంది. పెన్నా డెల్టా క్రింద సోమశిల, కనిగిరి, నెల్లూరు, సర్వేపల్లి రిజర్వాయర్లలో 20 టి.ఎం.సి.ల నీరు మాత్రమే ప్రస్తుతం నిల్వ వున్నట్లు విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింది. సుమారుగా 40 టి.ఎం.సి. ల నీరుంటే పెన్నా డెల్టా క్రింద వున్న 3 లక్షల ఎకరాల పంట పండేందుకు ఏప్రిల్ 15 తేది వరకు నీటిని సరఫరా చేయవచ్చు. ప్రస్తుతం ఉన్న నీరు ఫిబ్రవరి 28 తేది వరకు సరిపోతుందని, తరువాత నీరు ఇవ్వలేమని నెల్లూరు సెంట్రల్ డివిజన్ ఎస్.ఇ. శేషగిరి రావు చేసిన ప్రకటన - రైతులు వ్యవసాయ పనులు ప్రారంభించాలో, మానుకోవాలో తెలియని త్రిశంకు స్వర్గంలో వుంచింది. డిశంబరు నెలలో తుఫానులు వుడితే గాని వర్షాలు పడే అవకాశం లేదు. ఈ విషయం గతవారం జరిగిన జిల్లా అభివృద్ధి మండలి సమావేశంలో చర్చకు వచ్చింది. అల్లూరు శాసన సభ్యుడు జక్కా వెంకయ్య ఈ విషయమై సమగ్రమైన విషయాలతో ఒక నివేదిక ఇన్‌ఛార్జి మంత్రి హరికృష్ణకు సమర్పించారు. సేవ్ ది క్రాప్ పథకం క్రింద జిల్లాలో ప్రస్తుత పరిస్థితులను ఎదుర్కొనేందుకు 5 కోట్లు కేటాయించాలని సమావేశంలో తీర్మానించారు. రాష్ట్ర ప్రభుత్వం ఇప్పుడున్న పరిస్థితుల్లో నిధులు మంజూరు చేయగల దన్నది సందేహమే. ఏది ఏమైనా జిల్లా కలెక్టర్, ఎమ్మెల్యేలు, రైతు సంఘాల ప్రతినిధులతో వెంటనే ఒక సమావేశం ఏర్పాటు చేసి, అపోహలు తొలగించి స్పష్టమైన హామీ ఇస్తే గాని రైతులు నిబ్బరంగా వ్యవసాయ పనులు చేసుకోలేరు.

### నెల్లూరు సంగతులు

#### నెల్లూరులో సుబ్బరామరెడ్డి విగ్రహం!

పార్లమెంటు సభ్యుడు మాగుంట సుబ్బరామ రెడ్డి స్మృతి చిహ్నంగా నెల్లూరులో ఆయన విగ్రహాన్ని ఏర్పాటు చేస్తున్నారు. ఈ మేరకు ఒక తీర్మానాన్ని 4 తేది జిల్లా ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీస్ ఏర్పాటు చేసిన సంతాప సభలో ఆమోదించారు. ఈ సందర్భంగా ఛాంబర్ అధ్యక్షుడు సిసి సుబ్బరాయులు శెట్టి మాట్లాడుతూ సుబ్బరామ రెడ్డి తన సొంత డబ్బుతో ఎన్నో ప్రజోపయోగ కార్యక్రమాలు చేపట్టినట్లు చెప్పారు. తన సంస్థలలో వేలాది మందికి ఉపాధి కల్పించిన ధన్యజీవి మాగుంటని సంస్థ కార్యదర్శి కొమ్మిన సుబ్రహ్మణ్యం శ్లాఘించారు. సభకు ముందు సభికులంతా దివంగత నాయకునికి సంతాపం తెలుపుతూ రెండు నిమిషాల పాటు మౌనం పాటించారు. రోటేరియన్లు ఎ. ధర్మారెడ్డి, డి. భరత్ కుమార్ రెడ్డి, ఎం. సుబ్బరాయుడు, హరనాథ రావు సభలో ప్రసంగించారు.

#### ప్రపంచ మానవ హక్కుల దినోత్సవం

మానవ హక్కుల సేవా సమితి 10 తేది ప్రపంచ మానవ హక్కుల దినోత్సవాన్ని టౌన్‌హాల్‌లో జరుప బోతూంది. ఈ సందర్భంగా ఏర్పాటయ్యే సభకు మార్కెటింగ్ శాఖామాత్యులు టి. రమేష్ రెడ్డి ముఖ్య అ[illegible] విచ్చేస్తారు. జిల్లా జడ్జి ఎల్. అప్పారావు, ఫోరం అధ్యక్షుడు కె. సిద్ధారెడ్డి, పౌర సరఫరాల అధికారి ఎం. భరత్ రెడ్డి, బార్ అసోసియేషన్ కార్యదర్శి పి. వాగేశ్వర రావు, ఆర్టీఒ టి.కె. శ్రీదేవి ఉపన్యసిస్తారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఇంతకు ముందు వివిధ పాఠశాలలో నిర్వహించిన పోటీల్లో విజేతలకు బహుమతు లందజేస్తారు.

#### పోలియో పై ఇక సమరం

సారా వుద్యమం మొదల నెల్లూరుకు వస్తున్న కలెక్టర్లు వివిధ ప్రజ వుద్యమాలు చేపట్టి విజయ వంతంగా నిర్వహిస్తున్నారు. ట్యూషన్ల వ్యతిరే

కొరవ 19 పేజీలో



సినాకిని లయన్స్ క్లబ్ నిర్వహించిన ఉచిత వైద్య శిబిరంలో ఒక బాలుడ్ని పరీక్షిస్తున్న నేత్ర వైద్యురాలు డాక్టర్ భారతి; స్టేట్‌బ్యాంక్ ఏజీఎం గోపాలేశ్వరరావు

### స ఖు గు డు

#### * కొంచెం మర్యాద నేర్చుకోండి సార్!

పోలీసులలో సత్తప్రవర్తన, సంస్కారం ఆశించడం ఎడార మధుగులో స్వచ్ఛమైన నీరు దొరుకు తుందని ఆశపడడం వలెనే వుంటుంది. దియ్యంలో వడ్ల గింజల వలె ఎక్కడో ఒకటీ అరా తప్ప లభించరు ఆ లక్షణాలు కల్గిన వారు. ఖాకీ దుస్తులు వంటి మీదకు చేరగానే అదేదో అతీంద్రియ శక్తులు, అధికారాలు తమకు వశమైనట్లు భావిస్తుంటారు పోలీసు అధికారులు. అయితే వచ్చిన చిక్కల్లా ఎక్కడంటే - వారి ప్రతాప మంతా సన్న జనం పైనా, సగటు పౌరుల పైన మాత్రమే!

మూడు రోజుల క్రితం నెల్లూరు ఆర్‌టిసి బస్టాండు దగ్గర ఒక చిన్న సంఘటన. పృథ్వీ నారాయణ గారట - ట్రాఫిక్ ఇన్స్‌పెక్టరు - ప్రవర్తన చూశాను ప్రత్యక్షంగా! సగటు పౌరుడి పై జులుం చలాయించ డానికి ఎంత వురవుర వుంటుం దండీ వీరిలో? తమరు చేస్తున్నది తప్పని చెప్తే ఎంత పౌరుషం పొడుచుకొని వస్తుందో!

ఆ ప్రక్క రోజు, ఒక ప్రింటింగ్ ప్రెస్ యజమానిని అన్యాయంగా స్టేషన్‌లో నిర్బంధించారు మరొక అధికారి. ఎందుకు స్టేషన్‌లో పెట్టారంటే సమాధానం చెప్పరు. తమ అధికార అహంభావంతో ఎవరినైనా కారణం లేకుండా స్టేషన్‌లో నిర్బంధించ డానికి

**డోలేంద్ర**

వెనుకాడడం లేదు పోలీసధికారులు; రోజుల పర్యంతం అట్లా మానసిక క్షోభ పెట్టడం వీరికి వినోదమై పోయినట్లుంది. విచిత్రమే మిటంటే సాధారణ పౌరులుగా ఇటువంటి అన్యాయపు నిర్బంధాల పట్ల మొరపెట్టు కొంటే పెడ చెవిన పెట్టే ఇదే అధికారులు ఒక నాయకుడు ఫోన్ చేస్తేనో, ఒక పై అధికారి దబాయిస్తేనో గడగడ

కొరవ 12 పేజీలో

# మరువరాని మంచి మనిషికి కన్నీటితో అంజలి!



మా తండ్రి

పెళ్ళకూరు రామచంద్రారెడ్డి గారి

వియోగ విషాదం నుంచి

మేమింకా తెరిపిన పడనేలేదు;

అప్పుడే ఈ విలయతుల్య దుర్ఘటన!

మా తండ్రికి సన్నిహితుడు

మా ఇంటిలో ఒక సభ్యుడుగా

మా పై ఆప్యాయత కురిపించిన,

అభిమానం ప్రదర్శించిన

**మాగుంట సుబ్బరామరెడ్డి గారి**

మరణం భరించలేకున్నాం!

ఆయన స్నేహ సౌహార్దత

మాలిన్యం లేని మానవత

కలకాలం గుర్తుండిపోతాయి!

కరదీపికగా నడిపిస్తాయి!

ఆ మంచి మనిషికి

మనసావాచా అంజలి ఘటిస్తూ

ఆత్మశాంతికి భగవంతుడ్ని అర్థిస్తున్నాము

- పెళ్ళకూరు వెంకట సుబ్బారెడ్డి

ప్రభాకర రెడ్డి

వసంతకుమార రెడ్డి

## జిల్లావార్తలు

# వీధులు అమ్మేసే వ్యాపారం కావలిలో జోరుగా వుంది!

కావలి పట్టణంలో ట్రంకురోడ్డు పొడుగునా ఆక్రమించి వున్న ప్రభుత్వ స్థలాలను ఆక్రమణ దారులు కొన్ని లక్షల రూపాయలకు అమ్మి సొమ్ము చేసు కొంటున్నారు. ఎంతో కాలంగా ఆక్రమించి వున్న స్థలాలు నాలుగు రోడ్ల

కూడలిలో ఉండడంతో వాటికి విపరీతమైన విలువ పెరిగింది. ప్రభుత్వ స్థలం తమ స్వంతం అయినట్లుగా అమ్మకాలు, కొనుగోళ్లు జరిగి పోతున్నా పట్టించుకొనే అధికారే లేక పోవడం ఆశ్చర్యం కల్గిస్తూంది. పట్టణంలో రోడ్లు వెడల్పు చేయను నిధులు మంజూరై వున్నాయన్న వార్త రావడంతో ఈ అక్రమ వ్యాపారాలు ఎక్కువయ్యాయి. ముున్సిఫ్ కోర్టు వద్ద ఒక చిన్న బంకు పెట్టుకొనే స్థలం 15 వేల రూపాయలు ధర పలుకు తుండగా, ఒంగోలు బస్టాండ్ వద్ద అదే విస్తీర్ణపు స్థలం 20 వేలకు అమ్ముడు పోతున్నది. కొన్ని రోజుల క్రితం ఈ ఆక్రమణల తొలగింపుకు రోడ్లు భవనాల శాఖాధి కారులు ప్రయత్నించారు. అయితే రాజకీయ నాయకుల జోక్యం వల్ల ఆ పనికి అంతరాయం ఏర్పడింది. దాన్ని ఆసరాగా తీసుకొని స్థానికంగా బలంగా వున్న వాళ్లు స్థలాల ఆక్రమణలకు మళ్లీ పూనుకొన్నారు. ఒక ఛోటా తెలుగు నాయకుడు వెంకటేశ్వర థియేటర్ వద్ద కొన్ని ప్రభుత్వ స్థలాలు ఆక్రమించి చిన్న చిన్న వ్యాపారాలు చేసుకొనే వారికి బాడుగకు ఇచ్చి వారి నుండి దినసరి బాడుగ వసూలు చేస్తున్నారు. మరి కొందరు లత, సాయి మహల్ థియేటర్ల ఎదురుగా వున్న స్థలాల్లో బంకులు పెట్టి వాటికి నెల బాడుగను వసూలు చేస్తున్నారు. ఇటీవల టౌన్‌లో నిర్మించిన ఓవర్ బ్రిడ్జి క్రింద ఏర్పడిన ఖాళీ స్థలాల విషయమై ఆక్రమణ దారుల మధ్య పోటీ పెరిగి కొట్లాట వరకు పోయింది. ఇటీవల ప్రభుత్వ ఆసుపత్రికి ఆనుకొని వున్న ఖాళీ స్థలాలను కొందరు కాంగ్రెస్ నాయకులు ఆక్రమించుకొని గ్యారేజి ఏర్పాటుకు రేకులు వేయించగా ప్రజల ఒత్తిడితో ఎమ్మెల్యే వాటిని తొలగించారు. ఈ ఆక్రమణలు తొలగించడం పట్ల ఆర్‌అండ్‌బి అధికారుల్లో చిత్తశుద్ధి లేదని తేలిపోయింది. కావలి ఆర్డీఓ అయినా ఈ విషయంలో శ్రద్ధ వహించి ప్రభుత్వ ఆస్తులు దుర్వినియోగం కాకుండా చూడవలసి వుంది.

### గూడూరు మునిసిపల్ సమావేశంలో రచ్చ!

గూడూరు మునిసిపల్ సమావేశం 28 తేది ఛైర్ పర్సన్ సునీల్ కుమార్ అధ్యక్షతన జరిగింది. సమావేశంలో ఒకే ఒక అంశం మీద చర్చ జరిగింది. పట్టణ శివారులోని దవల పాళెం, నెల్‌క్యాస్ట్ ఫ్యాక్టరీ, వేర్ హౌసింగ్ గోడౌన్లు ఇతర పరిశ్రమలు ఉండే ప్రాంతాలు మునిసిపాలిటీ పరిధిలో వుండగా, పన్నులు మాత్రం దివిపాళెం పంచాయితీ వసూలు చేసు కొంటున్నదని పలువురు సభ్యులు ఆరోపించారు. పాత మునిసిపల్ కౌన్సిల్‌లోనే ఈ ప్రాంతాలను గూడూరు మునిసిపాలిటీలో కలపాలని తీర్మానం చేసినట్లు 27 వార్డు కౌన్సిలర్ శీలం కిరణ్ కుమార్ వివరించారు. మళ్లీ అదే అంశాన్ని అజెండాలో పెట్టడం ఎంత వరకు సమంజసమని ప్రశ్నిస్తూ, ఈ ప్రాంతాల నుంచి వచ్చే పన్నులు ఖచ్చితంగా మునిసి పాలిటీకి చెందాలన్నారు. కాని వేమారెడ్డి రామచంద్రా రెడ్డి వర్గానికి చెందిన కౌన్సిలర్లు సుబ్రహ్మణ్యం, సలీంలు మాత్రం ఫక్తు దివిపాళెం పంచాయితీ బోర్డు సభ్యుల వలె అధికారుల వాదనకు దిగారు. గూడూరు మునిసి పాలిటీకి ఆదాయం లేదని దివిపాళెం కడుపు కొట్టడం అన్యాయమని సభలో రభస సృష్టించారు. మునిసిపల్ కౌన్సిలర్ల వితండ వాదానికి ఛైర్మన్ సునీల్ కుమార్‌కు ఏమి చేయాలో పాలు పోకుండనే సమావేశం అర్థాంతరంగా ముగించారు.

# అనాథల కోసం వచ్చే అన్ని కోట్ల నిధులు ఏమైపోతున్నాయి?

సమావేశం ఆఫ్ తెలుగు బాప్టిస్ట్ చర్చిల నిర్వాహకునిగా వున్న కావలి వాసి దేవదానం పై పలు క్రైస్తవ సంఘాలు విమర్శలు సంధించాయి. ఇటీవల కావలిలో ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ దాదాపు వంద సంవత్సరాల చరిత్ర గల్గిన ఎబిఎం సంస్థ చర్చిల్లో బాంబులు తయారు చేసి క్రైస్తవ మతానికి దేవదానం మాయని మచ్చ తెచ్చారని ధ్వజమెత్తారు. అమెరికన్ బాప్టిస్ట్ మిషన్ (ఎబిఎం) పేరుతో ఏర్పాటైన సంస్థ తరఫున అనాథలకు హాస్టళ్లు ఏర్పాటు చేయడానికి, వాటి నిర్వహణకు కోట్లాది రూపాయలు ప్రతి సంవత్సరం నిధులు వస్తున్నాయి; నిధులేమై పోతున్నాయో అంతు బట్టడం లేదు. అంతా స్వాహానే! సంస్థ తరఫున కావలి, నెల్లూరులో వున్న హై స్కూల్, జూనియర్, డిగ్రీ కాలేజీల ఆస్తులను కూడా దేవదానం అమ్మేసినట్లు ఆరోపించారు. సంస్థ బాధ్యతల నుండి 65 సంవత్సరాలు నిండిన తరువాత విరమించాల్సి వుండగా ఇటీవల జరిగిన ఫాస్టర్ కౌన్సిల్ ఎన్నికల్లో ఇతరులు గెలవడంతో వారిని చంపేందుకు దేవదానం బాంబులు తయారు చేయించినట్లు స్పష్టమైందన్నారు. సమావేశంలో తెలుగు బాప్టిస్ట్ చర్చిల కార్యదర్శి ప్రభాకర రావు, కోశాధికారి వేముల జాన్, క్రిస్టియన్ స్టూడెంట్స్ పేరెంట్స్ అసోసియేషన్ ప్రతినిధులు ఎం. దేవదానం, సుందరం, మత పెద్దలు విజయ కుమార్, సాల్మన్ రాజా తదితరులు పాల్గొన్నారు. నెల్లూరు అమెరికన్ ఆసుపత్రిలో రేగిన గొడవల తర్వాత దేవదానం పై విమర్శల పరంపర ఎక్కువైంది.

### ఎబిఎం సంస్థ క్రైస్తవులు అడుగుతున్నారు!

### దివిపాళెం చెరువు రాత మారదా?

గూడూరు డివిజన్‌లోని దివిపాళెం చెరువు కాంట్రాక్టరు అద్భుత పనితనం వల్ల ఏడు సంవత్సరాలలో మూడు సార్లు తెగి పోయింది. గత సంవత్సరం నవంబరు నెలలో కురిసిన భారీ వర్షాలకు తెగిపోయిన చెరువు దుర్గతిని సంవత్సరం గడుస్తున్నా నీటి

కొరవ 12 పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## జనార్ధనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 11 తేది వాకాడు వస్తున్నారు. 12 తేది నెల్లూరులో మాగుంట కర్మక్రతువులకు హాజరౌతారు; 13 తేది వాకాడులో మకాం; 14 తేది వెంకటగిరిలో పర్యటన; 15 తేది తిరుపతి మీదుగా హైదరాబాదు వెళ్తారు.

## శరద్‌పవార్

మహారాష్ట్ర మాజీ ముఖ్య మంత్రి శ్రీ శరద్ పవార్ 5 తేది నెల్లూరు వచ్చి, మాగుంట సోదరులను పరామర్శించి వెళ్లారు. తన అనుభవాన్ని, అవగాహనను బట్టి ఈ హత్యకు కారణం కిడ్నాప్ యత్నం విఫలం కావడమన్న వాదన నమ్మశక్యంగా లేదని వ్యాఖ్యానించారాయన.



## పెంచలరెడ్డి కోలుకున్నాడు

సుబ్బరామరెడ్డితో పాటు తుపాకి తూటా తగిలి గాయపడిన మాజీ ఎమ్మెల్యే శ్రీ చెన్నారెడ్డి పెంచలు రెడ్డి మద్రాసు అపోలో ఆస్పత్రిలో కోలుకుంటున్నారు. పొత్తి కడుపుకు ప్రక్కగా దిగబడిన బుల్లెట్‌ను శస్త్ర చికిత్స చేసి తొలగించారు. ఇక ప్రమాదమేమీ లేదు.

ఈ ప్రమాదం నుంచి పెంచలు రెడ్డిని భగవంతుడే రక్షించా డనుకోవాలి!

## గన్‌మ్యాన్‌కు 3 లక్షల సాయం

సుబ్బరామ రెడ్డి గారిని కాపాడబోయి నక్సల్స్ ఘాతుకానికి బలై పోయిన గన్‌మాన్ రత్నం కుటుంబానికి శ్రీమతి మాగుంట పార్వతమ్మ భూరి సహాయం అందజేశారు. అతడి భార్యకు లక్ష,కుమార్తెకు లక్ష ఇద్దరు కుమారులకు చెరొక రు. 50 వేలు ఆర్థిక సహాయం అందజేశారు.

గన్‌మాన్ ప్రకాశం జిల్లాకు చెందిన వాడు. చాలా కాలం నుంచి సుబ్బరామ రెడ్డి గారి దగ్గరే వుంటున్నాడు

* * *

సుబ్బరామ రెడ్డి గారి మరణానంతరమూ ఆయన ప్రారంభించిన మంచి నీటి సరఫరా వంటి ప్రజా సేవా కార్యక్రమాలు, వాగ్దానం చేసిన దాన ధర్మాలు యథా ప్రకారం [illegible] జరుగుతాయని వారి కుటుంబం తరఫున శ్రీ పివి ప్రసన్న రెడ్డి [illegible] మాట ఇచ్చారు.

మాగుంట [illegible] ఔన్నత్యాన్ని పెంచే నిర్ణయమిది.

## ఎక్సైజ్ సమ్మె- మందు ప్రవాహం

ఎక్సైజ్ సిబ్బంది సమ్మెలో వున్నందువల్ల మందు ప్రియుల పని భలే ఖుషీగా వుంది. బ్రాందీ, విస్కీలు ప్రవాహం వలె పారుతున్నాయి జిల్లాలో! మద్రాసు నుంచి రైళ్లు, బస్సులు, కార్లలో విచ్చల విడిగా దిగుమతి అవుతున్నది.

ఎక్సైజ్ ఎసి గారు మాత్రం తాము ప్రతి రోజూ మందు కేసులను పట్టు కొంటూనే వున్నామని చెప్తున్నారు. సమ్మె కాలంలో 164 మందిని పట్టుకొని 252 సీసాలు, 29 లీటర్ల నాటు సారా పట్టు కున్నారట. సముద్రంలో- గ్లాసుడు నీళ్లు ముంచినట్లే ఈ లెక్కలు.

## నీళ్ల వెంకయ్య నిరాహారదీక్ష

జనం సేవే తన జీవితా దర్శమని భావించి, ప్రజా సేవే లోకంగా బ్రతికే అమాయకుడు నీళ్ల వెంకయ్యను నెల్లూరు రెవిన్యూ ఇన్స్‌పెక్టర్ అరెస్టు చేయించారట. ఎవరికో పట్టా ఇప్పించే విషయంలో ఏదో ఘర్షణ జరిగినట్లుంది. తన మీద పెట్టిన కేసు తీసివేసి, ఆర్‌ఐని సస్పెండ్ చేసిన దాకా నిరాహార దీక్ష చేస్తానని హెచ్చరిస్తున్నాడు నీళ్ల వెంకయ్య.

ఆ అమాయకుడి మీద ఎందుకండీ రెవిన్యూ ప్రతాపం?

## ఫ్యాక్టరీలకు సెలవు

పోలియో వ్యాధి నివారణకు టీకాలు వేసే జాతీయ కార్యక్రమం సందర్భంగా డిసెంబరు 9 తేది, జనవరి 20 తేది అన్ని ఫ్యాక్టరీలు, అంగళ్లు, ఇతర సంస్థలు విధిగా సెలవు ప్రకటించాలని కలెక్టర్ ఆదేశించారు. ఉద్యోగులు, కార్మికులు తమ పిల్లలను పోలియో శిబిరాలకు తీసుక వెళ్లడం కోసమే ఈ వెసలుబాటు. ఈ ఆదేశాన్ని ఖచ్చితంగా పాటించాలని అసిస్టెంట్ లేబర్ కమీషనర్ శ్రీ లక్ష్మి నారాయణ కోరుతున్నారు.

## రొయ్యలకు మళ్లీ వైరస్

రొయ్యలు మళ్లీ వైరస్ వ్యాధి చిక్కుల్లో పడి పోయాయి. వాతావరణం చల్లబడి చలిగాలులు వీస్తుండడంతో ఆ మహమ్మారి ఉధృతంగా వ్యాపిస్తోంది. రైతులు కొంచెం నిగ్రహం వహించి, వాతావరణం వేడెక్కే వరకు, కనీసం ఫిబ్రవరి రెండవ వారం వరకైనా చెరువుల్లో సాగు చేపట్టకుండా వుంటే అందరూ బాగుపడ్తారు. ఆత్రుత ప్రదర్శిస్తే మొత్తం పరిశ్రమ నష్టపోవలసి వుంటుంది.



గారు చీకట్లో కాంతి రేఖ వలె
వెలుగులు పంచిన మీరే
అనంతతిమిరంలో ఐక్యమైపోతే

ఆ నిజం జీర్ణించుకోవడం మా తరమా?

నెల్లూరు కోసలచాం

జమీన్‌రైతు, నెల్లూరు

జననం:
26.11.1947



మరణం:
1.12.1995

మా తండ్రి

# శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి గారు

పార్లమెంటు సభ్యులు

**1.12.1995** తేదిన పరమపదించినారు.

**12.12.1995** తేదిన మంగళవారం నెల్లూరులోని

మా స్వగృహామునందు "పెద్దకర్మ" జరుగును.

మాగుంట విజయకుమార రెడ్డి (కుమారుడు)

మాగుంట మమత (కోడలు)

**కుటుంబసభ్యులు**

మాగుంట కౌసల్యమ్మ (తల్లి)
మాగుంట పార్వతి (భార్య)
మాగుంట సుధాకర రెడ్డి (తమ్ముడు)
మాగుంట స్నేహలత (మరదలు)
మాగుంట శ్రీనివాసులు రెడ్డి (తమ్ముడు)
మాగుంట గీతాలత (మరదలు)
సిద్దవరపు మధుసూదన రెడ్డి (బావమరిది)
సిద్దవరపు సుహాసిని (చెల్లెలు)

ఆనం శివకుమార రెడ్డి (అల్లుడు)
ఆనం సుమాలిని (కుమార్తె)
గునుపాటి గౌతమ్ రెడ్డి (అల్లుడు)
గనుపాటి దీప్తి (తమ్ముని కుమార్తె)
మాగుంట కిరణ్ రెడ్డి (తమ్ముని కుమారుడు)
మాగుంట రాఘవరెడ్డి (తమ్ముని కుమారుడు)
మాగుంట నిఖిల్ రెడ్డి (తమ్ముని కుమారుడు)
సిద్దవరపు దశరధరామిరెడ్డి (మేనల్లుడు)
సిద్దవరపు వెంకట స్వరూపరెడ్డి (మేనల్లుడు)

ఆనం అనిష్ (మనుమడు)

## ఏ పాపం

(మొదటి పేజీ తరువాయి)

కన్పించి నట్లున్నారు; సుబ్బరామ రెడ్డి గారిని అనుకొని నిలబడి వున్న హంతకులు కన్పించలేదు. ఏదో ప్రమాదం జరగ బోతుందని భయపడి గన్‌మ్యాన్ ముందున్న గణేశ్ పై కాల్పులు జరిపారు. ఒక బుల్లెట్ ఆతడికి తగిలింది. దానితో అతడు తిరిగి కాల్పులు ప్రారంభించారు. ఈ గలభాకు సుబ్బరామ రెడ్డిని అనుకొని వున్న ఇద్దరు దుండగులు కూడా కాల్పులు జరిపారు. అంతా గందరగోళం ఎవరు ఎవర్ని కాలుస్తున్నారో; ఏమి జరుగుతున్నదో తెలియని అయోమయం; సుబ్బరామ రెడ్డి గారు, చిన్నారెడ్డి పెంచల రెడ్డి, తాడిపర్తి సుబ్బారెడ్డి, గన్‌మ్యాన్ రత్నం తదితరులంతా గాయపడ్డారు. దుండగులు మాత్రం తుపాకి దెబ్బ తిన్న గణేశ్‌ను భుజాన మోసుకుంటూ బయటకు వెళ్లి, రెడీగా వున్న అంబాసిడర్ కారులో బైపాస్ రోడ్డు వైపు వెళ్లారు. వెళ్లబోయే ముందు తుపాకి చూపించి, జనాన్ని భయపెట్టి ఎవరూ అడ్డం రాకుండా చూసుకున్నారట. పారిపోయే సమయంలో, కర్నూలు రోడ్డు కూడలిలో కారు చెడిపోయింది. 10 నిముషాలు రిపేరు కోసం ప్రయత్నించారు. ఈలోగా ఒక కానిస్టేబిల్ రోడ్డుకు అడ్డంగా కారు పెట్టారెందుకని అడగడానికి వచ్చేసరికి తుపాకి చూపించి భయపెట్టారు. ఆ కారును అక్కడే వదిలేసి, రోడ్లో వెళ్తుండిన మరొక కారును నిలిపి, దౌర్జన్యంగా అందులోని వారిని క్రింద విసిరేసి త్రోవగుంట వద్ద చీరాల రోడ్డుకు మళ్లి, పారిపోయారు. ఆ తర్వాత మధ్యలో పోలీసులు ఆపడం, కారు వదిలేసి పరుగెత్తే సమయంలో గణేశ్ కొందరు యువకుల కళ్ల బడడం, వారు విషయం తెలుసుకొని అతడ్ని పట్టి పోలీసుకు అప్పచెప్పడం; కారు డ్రైవరు ఒక బస్సు ఎక్కి పారిపోబోతుంటే ఒక సిఐ గమనించి పట్టుకోవడం తెలిసిందే.

ఇదీ జరిగింది. ఇందులో పలు సందేహా లున్నాయి. కిడ్నాప్ చేయడానికి వచ్చిన వారు అందరు జనం మధ్య సరిగా నడవని కారుతో అంత పెద్ద సాహసం చేస్తారా? కిడ్నాప్ ప్రయత్నం నిజమైతే అందుకు బలమైన కారణ ముండాలి; అది ఏమిటి? ఒక ఎమ్పీని, అందులోనూ రాజకీయంగా, ఆర్థికంగా బలపేతుడైన నాయకుడ్ని కిడ్నాప్ చేయాలంటే చాలా ఉన్నత స్థాయిలో, ప్రొవిన్షియల్ కమిటీ అనుమతితో ప్రయత్నం జరిగి వుండాలి. కాని అటువంటిదేదీ వున్నట్లు కన్పడలేదు. ఈ హత్యకు కీలక పాత్రధారి అయిన గణేశ్ చాలా చిన్న కార్యకర్త మాత్రమే. ఇంత పెద్ద ప్రయత్నానికి అనుభవజ్ఞ లెవరినైనా పంపించి వుండాలి కదా? అనుభవం వుండి వుంటే గన్‌మ్యాన్‌ను కవర్ చేయకుండా కిడ్నాప్‌కు యత్నించి వుండే వారా? వేకువ ఝామున నాలుగు నుంచి సుబ్బరామ రెడ్డి ఇంట్లోనే వున్నప్పుడు, ఆ సమయం వదిలేసి మిట్ట మధ్యాహ్నం ఎందుకు దాడికి సమకట్టారు? ఉదయమైతే ఇంత రభస జరిగి వుండేది కాదు కదా? ఒంగోలు చుట్టు ప్రక్కల అడవులేవీ లేవు? పొదిలి దగ్గర కొండలలో దాచిపెట్టాలని పథకం వేసినట్లు చెప్తున్నారు అదే నిజమైతే, హత్య తర్వాత అటువంటి సురక్షిత మార్గాలలో వెళ్లకుండా జాతీయ రహదారి పై ఎందుకు పారిపో జూశారు? తుపాకి దెబ్బ తగిలిన గణేశ్‌ను వదిలేసి తక్కిన వారు ఎట్లా వెళ్ల గలిగారు? ఒంటరిగా అతడు తప్పించు కోలేడని, పోలీసులకు దొరికి పోతాడని వూహించలేదా? అంత అమాయకంగా తమ నాయకుడ్ని వదిలేస్తారా? కారు డ్రైవరు తాను నక్సలైట్‌ని కాదని చెప్పాడట. కాకుంటే, దొంగ నంబరు ప్లేటుతో కారు నడపడానికి ఎట్లా సమ్మతిస్తాడు? వారు తుపాకులతో కాల్చి బయటకు వచ్చినప్పుడు కారు వదిలేసి వెళ్లకుండా వారిని తప్పించేందుకు ఎందుకు యత్నిస్తాడు?

నక్సల్స్ ఉద్యమంలో గణేశ్ స్థాయి, స్థానం పట్ల సైతం సందేహాలున్నాయి. అతడు ఏదైనా వ్యక్తిగత కారణాలతో స్వతంత్రించి ఈ నిర్ణయం తీసుకున్నాడా? లేక నిజంగా పార్టీ అనుమతి వున్నదా అన్నది సందేహం.

ఏది ఏమైనా ఈ విషయంలో పోలీసు చాలా లోతుగా దర్యాప్తు జరప వలసి వుంది. హత్య చేసింది నక్సలైట్లే నన్నది రుజువైంది కాబట్టి, దీని పై ఆ ఉద్యమ అగ్రనాయకత్వం సరైన వివరణ ఇస్తే ప్రజలకు వుపకరిస్తుంది.

---




---

## జిల్లావార్తలు

8 పేజీ తరువాయి

పొరుదల శాఖాధి కారులు పట్టించు కోలేదని గ్రామస్తుల ఆవేదన. దివిపాళెం చెరువు క్రింద 200 ఎకరాల పంట పండుతుంది. చెరువు రిపేరు చేయించక పోవడం, దానివల్ల నీరు నిల్వ లేక పోవడంతో ఈ సంవత్సరం పంట వేయలేదట. 93 సంవత్సరంలో చెరువు కట్ట తెగినప్పుడు మరమ్మత్తులు చేయకుండానే 82 వేల రూపాయలు కాంట్రాక్టర్ బిల్లు చేసుకొన్నాడట. ఈ విషయమై ఇరిగేషన్ ఇంజనీర్లు బాగా సహకరించడంతో ఈ స్వాహా పూర్తయినట్లు ఆరోపణ. చెరువు తరచూ తెగడం, ఈ కాంట్రాక్టరే క్రమం తప్పకుండా దాన్ని చేజిక్కించుకొని తన జేబులు నింపుకొని రైతులకు అన్యాయం చేస్తున్నా పట్టించుకొనే అధికారే లేడా? ఆర్డీఒ గారు ఈ విషయం మీరు ఒకసారి పరిశీలించాలి.

---

## సణుగుడు

6 పేజీ తరువాయి

వణుకుతూ పరుగుల మీద చర్య తీసుకొంటారు.

మంత్రులో, ఐజిలో పరిచయ ముంటే తప్ప, పై నుంచి మొట్టి కాయలు వేస్తే తప్ప పోలీసు స్టేషన్‌లో న్యాయం జరగకుంటే సగటు పౌరుడు బ్రతికేదెట్లా? ఒక వ్యక్తిని నిర్బంధించి నప్పుడు అతడు తప్పు చేయలేదని తెలిస్తే తమంతట తాముగా వదిలేయడం పోలీసధికారి బాధ్యత? పై వారి చేత తొడ బెల్లం పెట్టించు కొనే వరకు ఎందుకు ఎదురు చూడాలి? ఆ తర్వాత తల దించుకొని అదే నిర్బంధితుడి ఎదుట ఎందుకు పరువు పోగొట్టు కోవాలి? అప్పటి వరకు అతడ్ని ఏడ్పిస్తే వీరికి వచ్చే ప్రయోజనం ఏమిటి? తమకు తాముగా సంస్కార వంతంగా, న్యాయంగా నిర్ణయాలు తీసుకోవడం అధికారులకు చేతకాదా? పైవారి అండలేని అమాయకులు, అనామకులు వీరి కాడిజానికి, అహంకారానికి గురి కావలసిందేనా?

అదే అధికారులు రాజకీయ వాదుల దగ్గర మాత్రం బానిస మనస్తత్వంతో ప్రవర్తించడం విడ్డూరంగా వుంటుంది. మంత్రుల దగ్గర వీరు బంట్రోతుల కంటే హీనంగా ప్రవర్తిస్తారు! పది మంది రౌడీ మూక చేతిలో కలిగిన ఛోటా నాయకులను చూసి కూడా హడలి చస్తారు. వారికి వంగి వంగి దండాలు పెడతారు. సాధారణ పౌరుడ్ని చూస్తే మాత్రం వీరికి ఎక్కడ లేని అలుసు. వాడిని ఏదైనా అనవచ్చు. ఏమైనా చేయవచ్చు అనే అహంకారం.

జనానికి ఇప్పుడు చట్టాలు తెలుసు; మానవ హక్కుల కమీషన్ అంటూ ఒకటి ఏర్పడి వుంది; పత్రికలు చాలా చైతన్యంగా వ్యవహ రిస్తున్నాయి. వీటిని చూస్తూ కూడా పోలీసధి కారులు తాము అన్నిటికీ అతీతుల మన్నట్లు ప్రవర్తిస్తే దారుణంగా దెబ్బతింటారు. తాత్కాలికంగా పై చేయి రుజువైనా, ఆ దుర్మార్గం ఎల్ల కాలం జరగదు. కొంచెం మర్యాద నేర్చుకొంటే వారికి వచ్చిన నష్టమేమిటి? నాకర్థం కాక అడుగుతున్నా. ఏమను కోకండి కానీ - దొంగలను పట్టడంలో, దోపిడీలు అరికట్టడంలో ఎక్కడికి పోతున్నాయి ఈ పోలీసుల మేధా సంపత్తి? బల సంపద?

---

## కారణమేమిటి?

8 పేజీ తరువాయి

పెద్ద పెద్ద పారిశ్రామికులు పరుగ పరుగున వచ్చి కడపటి శ్రద్ధాంజలి ఘటించారు.

పలువురు ప్రముఖులు దుఃఖం ఆపుకోలేక శ్రీనివాసులు రెడ్డి, సుధాకర రెడ్డిలను కౌగలించుకొని కన్నీరు కార్చడం చూసే వారిని చలింప జేసింది. ఎనబై వసంతాల సుదీర్ఘ జీవన ప్రయాణంలో ఎందరో సహచరులు, ఆత్మీయుల ఎడబాటు చవిచూచిన డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు కూడా ఏడుపు ఆపుకోలేక పోయారంటే ఈ విషాద మరణం ఆయనమనసును ఎంతగా చలింప జేసిందో అర్థం చేసుకోవచ్చు.

మధ్యాహ్నం 2 గంటలకే అంతిమ యాత్ర ప్రారంభిం చాలను కున్నారు. కాని జన ప్రవాహాన్ని నిలువరించి ఏర్పాట్లు చేయడం సాధ్యం కాలేదు. ఎంతో ప్రయాసతో ఉప్పెన వలె వచ్చి పడుతున్న జనానికి నచ్చచెప్పి, క్యూలు నిలిపి, అతి కష్టం మీద వారిని తొలగ దూసుకొని సాయంత్రం 4 గంటలకు బయల్దేర దీశారు. రంగనాథ స్వామి దేవాలయ అర్చకులు సుబ్బరామ రెడ్డి గారి భౌతిక కాయానికి సాంప్రదాయ బద్ధమైన పరివట్టం (దేముడి వస్త్రంతో తలపాగా) కట్టి, దైవార్చనలో వాడిన తులసిమాల, గంధపు చెక్కలు సమర్పించారు. అగ్ని దేముడ్ని శాంతింప జేసే హోమం నిర్వహించారు. వేద మంత్రాల పఠనం, వివిధ మతాల వారి ప్రార్థనల నడుమ శవ యాత్ర ప్రారంభ మైంది. సోదరులు సుధాకర రెడ్డి, శ్రీనివాసులు రెడ్డి, శ్రీ సిద్ధవరపు మధుసూదన రెడ్డి, జెకె రెడ్డి, వేనాటి చంద్రా రెడ్డి, పివి ప్రసన్న రెడ్డి తమ భుజాల మీద భౌతిక కాయాన్ని మోసుకొంటూ తెచ్చి, ట్రంకురోడ్డు వద్ద పూలతో అలంకరించిన లారీ పైకి ఎక్కించారు.

నాయకులు, ప్రజలు కూడా కాలి నడకనే అంతిమ యాత్రలో పాల్గొన్నారు. దారి పొడవునా మిద్దెల పై నుంచి పూల వర్షం కురిపించారు జనం. నినాదాలు మార్మోగాయి.

పెన్నానది ఒడ్డున అంత్యక్రియలకు పెద్ద ఎత్తున ఏర్పాట్లు జరిగాయి. ప్రత్యేకంగా నిర్మించిన వేదిక పై గంధపు చెక్కలతో చితిసమర్చి, జనం కోసం షామియానాలు, కుర్చీలు ఏర్పాటు చేశారు. విద్యుద్దీపాలు అమర్చారు. పెన్నకు జనం వరద వచ్చినట్లే వుండిందక్కడి దృశ్యం. ఆడవాళ్లు సైతం పెద్ద సంఖ్యలో హాజరైనారు. పెన్న వారధి నిండా కూడా జనమే. పోలీసు గౌరవ వందనం తర్వాత, రాత్రి 8.15 గంటలకు కుమారుడు విజయ కుమార రెడ్డి చితినంటించారు. జిల్లా జన జీవితాన్ని తన తేజోమయ వ్యక్తిత్వ ప్రకాశంతో ప్రభావితం చేసిన ఆయన శరీరం అగ్ని దేముడికి అర్పణ అయిపోయింది. ఆయన సోదరు లిద్దరూ ఏడుపు ఆపుకోలేక ఆ ఇసుకలోనే కుప్పకూలి పోయారు. చితిమంటలు రేగగానే జనం ఉద్వేగంగా నినాదాలు చేశారు.

---



---



# వాళ్లు నక్సలైట్లు కాదు - నరరూప రాక్షసులు

# ఏ పాపం చేశాడని ఇంత శిక్ష?

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి దారుణ హత్యకు కారణ మేమిటి? ఏ పాపం చేశాడని, ఏ నేరం చేశాడని ఆయన్ను అంత కసిగా చంపారు? కిడ్నాప్ చేయబోవడమే నిజమైతే దాని లక్ష్యమేమిటి? కేవలం తమ సోదర కామ్రేడ్‌లను జైలు నుంచి విడిపించు కోవడానికి ఇంత పెద్ద పథకం రచించారా? లేక అంతకంటే తీవ్రమైన, బయటకు చెప్పలేని కారణేలైవానా వున్నాయా?

## కిడ్నాపే అనుకున్నా కారణమేమిటి?

నిజానికి పీపుల్స్ వార్ కోస్తా, రాయలసీమ కమిటీ కార్యదర్శి శ్రీ రవిచంద్ర ఈ హత్య పై అంత సుదీర్ఘ వివరణ ఇచ్చిన తర్వాత ఇటువంటి ప్రశ్నలకు తెరపడాలి; హత్య చేసిన వారిలో ఒకరికి ఇద్దరు రెడ్ హ్యాండెడ్‌గా దొరికారు కాబట్టి ఈ దుర్ఘటన విషయంలో ఎటువంటి అనుమానాలు, సందేహాలకు తావు వుండకూడదు. సుబ్బరామ రెడ్డిని తామే చంపామని ఆయన స్పష్టంగా ప్రకటించాడు. దొరికిన హంతకు లిద్దరూ నక్సలైట్లనని ఒప్పుకున్నారు. అయితే ఈ విషయంలో జనం ఒక తుది నిర్ణయానికి రాలేక పోవడం, ఇంకా పలు రకాల చర్చలు జరుగు తుండడమే విచిత్రమైన విషయం. మహారాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి శ్రీ శరద్ పవార్ నెల్లూరు వచ్చి, కిడ్నాప్ కథ నమ్మడం కష్టమని చెప్పడం కూడా ఈ చర్చ కొనసాగింపుకు కారణమైంది. అయితే ఒక్కటి మాత్రం నిజం. ఈ హత్యకు పాల్పడింది నక్సలైట్లే అయినప్పటికీ వారు ఉద్యమంలో సీనియర్లు కాదు, అనుభవ పరులు అసలే కాదు. దుర్ఘటన జరిగిన తీరు, ఆ తర్వాత పారిపోబోతూ పట్టుబడిన తీరు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

1 తేది వేకువనే 4.30 గంటల సమయంలో సుబ్బరామ రెడ్డి గారు ఛార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో ఒంగోలు వచ్చారు. ఆయన్ను నక్సలైట్లు రైల్వేస్టేషన్ నుంచే అనుస రిస్తుండినారు. అంతకు పదిహేను రోజుల నుంచి సుబ్బరామ రెడ్డి ఆఫీసు వున్న భాగ్యనగర్‌లోనే వేరొక ఇల్లు తీసుకొని ఆయన రాకపోకలను, ఆ ఇంటి భౌగోళిక పరిస్థితులను సమగ్రంగా అధ్యయనం చేశారట వారు. హత్యకు మూడు రోజుల ముందు ఒక కారు బాడుగకు తీసుకొని దాని నంబరు ప్లేటు మార్చి, ఒక ఎకె 47 తో సహా ఆయుధాలు సమకూర్చుకొని సర్వసన్నద్ధమైనారు.

సుబ్బరామరెడ్డి గారు ఉదయం మార్కాపురం వెళ్లి మధ్యాహ్నం ప్రాంతంలో తిరిగి వచ్చారు. అప్పటికి ఈ హంతకులూ అక్కడ వున్నారట. వారిలో కీలకమైన గణేశ్ ముందుగా ఏదో సాకుతో సుబ్బరామ రెడ్డి గారి బెడ్ రూములోకి వెళ్లారట. కొద్ది సేపు మాట్లాడి బయటకు వచ్చి, హాలులో ఎదురు చూస్తుండినాడట. సుబ్బరామ రెడ్డి గారు బయటకు రాగానే ఇద్దరు దుండగులు ఆయన్ను వాటేసి పట్టుకొని, తమ రివాల్వర్లను ఆయన పొట్టకు ఆనించారట. ముందుగా ఒకడు గాలిలోకి కాల్చాడట. ఈ కాల్పుల శబ్దానికి హాలులో వున్న వారంతా కకావికలై పరుగెత్తారు. బెడ్ రూములో నుంచి గన్‌మ్యాన్ రత్నం రెండు అడుగుల వెనుకగా హాలులోకి వచ్చినట్లున్నాడు. అతడు వచ్చే సరికి ముందు తుపాకి పట్టుకొన్న దుండగుడే

కొరవ 12 పేజీలో

## ఒక దీపం

5 పేజీ కొరవ

కట్టించారు. ఎన్నో ఆస్పత్రులు, స్కూళ్లు, ఇతర సంస్థలకు ఇంకొకరిని అడగ వలసిన అవసరం రాకుండా అనుకున్న పనులు జరిపించ గలిగిన స్థాయిలో విరాళా లిచ్చారు. ఒంగోలు నియోజక వర్గ పరిధిలో 13 కాలేజీలు ప్రారంభించారు. వ్యక్తి గతంగా పెళ్లికో, ఇతర అవసరానికో యాచించి వచ్చే వారు కొన్ని వేల మందికి రెండో కంటికి తెలియ కుండా సహాయం చేసి పంపేవారు. తన దానాలు, విరాళాలకు తిరిగి తనకు పేరు, గుర్తింపు రావాలని ఎప్పుడూ అడిగే వారు కాదాయన. రంగనాథ స్వామి దేవాలయానికి గత ఐదారేళ్లలో పది లక్షల రూపాయల వరకు తోడ్పాటు నందించారు. కాని ఆ విషయం ఆలయం లోపలి వారికి తప్ప బయట ప్రపంచానికి తెలియదు. ఇటు వంటి గుప్త దానాలు ఎన్ని కోట్లలో వుంటాయో చెప్పలేము. ఆయన గొప్పతనం అదే! రేపు 9 తేది జరుగనున్న పోలియో వ్యాధి నిర్మూలనా కార్యక్రమానికి ఆయన లక్షా 70 వేలు విరాళం ఇచ్చారు. ఆయన చేతితో చేసిన ఆఖరి దానం బహుశా అదే అయి వుండవచ్చు.

అడిగిన వారికల్లా వుద్యోగాలు ఇప్పడం కూడా ఆయనకు ఒక సరదా! బాలాజీ స్టీల్స్‌లో అవసరం వుంది, లేదా అని కూడా చూడకుండా వెయ్యి మందికి పైగా ఉపాధి కల్పించారు. ముందు ఉద్యోగం ఇచ్చేసి, ఆ తర్వాత ఎక్కడో ఒక దగ్గర పని చేయించు కొమని తన వారికి అప్పచెప్పే వారు. కొన్ని వేల కుటుంబాలు అట్లా వారి మీద ఆధార పడివున్నాయి.

ఉదయం పత్రికా నిర్వహణ ఆయన చేసిన పొరపాట్లలో ప్రధాన మైనది. అందరితో మంచిగా సర్దుక పోవాలను కునే తత్వం కలిగిన వారు కావడంతో ఎవరినీ నొప్పించ కుండా, ఎవర్నీ విమర్శించకుండా పత్రిక నడప వలసి వచ్చింది. అదెట్లా సాధ్యం? కోట్లు గుమ్మరించినా ఆ పత్రిక పాఠకుల అభిమానానికి నోచుకోలేక పోయింది. ఆ అసంతృప్తి ఆయన్ను ఎప్పుడూ బాధిస్తుండేది. ఆ అపజయానికి పరిహారంగా మరొక తెలుగు పత్రిక, ఒక ఇంగ్లీషు డైలీ నడిపి సక్సెస్ చేయాలని తపన పడ్డారు; ఆ కోరిక తీరక మునుపే వెళ్లిపోయారు.

సుబ్బరామ రెడ్డి గారిది ధీరోదాత్త జీవితం! వ్యాపారంలో, రాజకీయంలో, ప్రజాభి మానంలో, దాన ధర్మాలలో తనకు సాటి రాగల వారు ఎవరూ లేరనిపించుకొని, ఆ విజయోత్సాహం చివరి క్షణం వరకు నిల్పుకొని, ఘనంగా కన్నుమూశారు. ఆయన మరణం ఆయన కుటుంబాని కంటే, ఆయన్ను నమ్ముకొని వుంటే వారికి తీరని ఖేదం కల్గిస్తుంది.

సుబ్బరామ రెడ్డి వంటి వ్యక్తి జిల్లాలో మరొకరు లేరు; ఇప్పట్లో చూడలేము. వారి కుటుంబానికి జమీన్‌రైతు తన ప్రగాఢ సంతాపం తెలియ జేస్తున్నది.

## ప్రకాశం కోల్పోయిన ప్రకాశం జిల్లా
## నేత్రాల్లో నెత్తురునిండిన నెల్లూరు జిల్లా



దర్పమెరుగని దయానిధి, బోళాశంకరుడు, శిబిసముడు మాగుంట సుబ్బరామన్న ఇకలేడన్న విషంలాంటి విషయాన్నివిని విలపించనివారు లేరు. ఇక వారి కుటుంబ సభ్యుల హృదయాలలోని మంటను ఏ ఊరడింపు మాటలు మాపగలవు? "అనంతుడే వారికి ఆత్మస్థైర్యాన్నివ్వాలి. ప్రకృతిమాతే మనో నిబ్బరాన్నివ్వాలి". అని అంజలి ఘటించి అర్పిస్తూ... డా॥ జె.పి.రెడ్డి, నెల్లూరు.

# మీరు లేని మాకిక ఈ లోకమంతా శూన్యం!



## మాగుంట సుబ్బరామరెడ్డి గారూ-

మీ మరణం నిజమని నమ్మడం మా శక్యం కావడం లేదు!
పారిశ్రామికుడిగా అందనంత ఎత్తుకు ఎదిగినా
మా వంటి చిరు పారిశ్రామికులకు
మీరు అందించిన మార్గదర్శకత్వం
మీరు కల్పించిన అండదండలు
మరువలేనివి; విలువ కట్టరానివి.
మీరులేని మాకిక ఈ లోకమంతా శూన్యం!
ఎన్ని కన్నీళ్లు కారిస్తే మీ రుణం తీరుతుంది;
మా గుండెల్లోని శోకం తీరుతుంది?
ఏ లోకంలో వున్నా ఈలోకంలోని మా పై
మీ కరుణార్ద్రదృక్కులు ప్రసరిస్తూనే వుంటాయని విశ్వసిస్తూ

జి. సాయిబాబారెడ్డి
జి. శ్రీనివాసులురెడ్డి

**రాఘవ కంటెయినర్స్**
చెర్లపల్లి - హైదరాబాదు

# సినిమాలు లేకున్నా భాను బిజీ!

"మీకు ఇటీవల సినిమాలు బాగా తగ్గాయి. షూటింగ్‌లు కూడా అట్టే ఉండటం లేదు. ఎలా పొద్దు పోతోంది మీకు?" అని భానుప్రియను అడిగితే "ఇదివరకటి కన్నా బిజీ. ఇప్పుడు రోజుకు ఇరవై నాలుగు గంటలు చాలడం లేదు" అంటూ ఇలా జవాబిచ్చింది. "మా చెల్లెలు నిశాంతి పాప ఎంత ముద్దొస్తుందో. కన్నది నిశాంతే గాని, ఆ పాప పెరుగు తున్నది నా దగ్గరే అని చెప్పాలి. ఆ పాపతో ఆడు కుంటుంటే, నేను సర్వస్వం మరచి పోతుంటాను".

## "ద్రోహి" చిత్రం చూడని కమలహాసన్ పుత్రికలు

"ఎంత పెద్దలయినా సరే నేను చాలా స్ట్రిక్ట్‌గా ఉంటాను" అంటూ కమల హాసన్ ఇలా అన్నారు "మీరు నమ్ముతారా? నా కూతుళ్లు శ్రుతి హాసన్, అక్షర హాసన్ ఇద్దరూ నేను నటించిన ద్రోహి చిత్రం చూడలేదు. ప్రివ్యూ రోజున ఇద్దరూ థియేటర్ వరకు వచ్చారు. శోభన, రేవతి, భానుప్రియ వగైరా నటీ నటులకు స్వాగతం చెప్పారు. కానీ, తీరా సినిమా ప్రారంభ మయ్యేసరికి ఇద్దరూ మా కారులో ఇంటికి తుర్రుమన్నారు. ఎందుకంటే ఆ చిత్రంలో వయొలెన్స్ ఎక్కువగా ఉంది. ఈ చిత్రానికి సెన్సార్ వారు 'ఎ' సర్టిఫికేట్ ఇచ్చారు. అంచేత, నా కూతుళ్ళను చూడవద్దన్నాను. అంతే" అన్నారు కమల హాసన్ నవ్వుతూ.

## "మెరుపు కలలు"

ఎ.వి.ఎం ప్రొడక్షన్ సంస్థ చిత్ర నిర్మాణానికి ఉపక్రమించి 50 ఏళ్లు అయింది. అర్ధ శతాబ్ది కానుకగా "మెరుపు కలలు" అనే ప్రేమ కథా చిత్రాన్ని నిర్మిస్తున్నాను. అరవింద స్వామి, ప్రభుదేవా, హిందీ నటి కాజోల్ ప్రధాన పాత్రధారులు. సంగీతం: ఎ.ఆర్. రెహమాన్. ఛాయ, దర్శకత్వం: రాజీవ్ మీనన్. ఈ చిత్రంలో హేమ మాలిని కూడా ఒక పాత్ర ధరించవచ్చు.



రిక్షావోడు చిత్రంలో సౌందర్య, చిరంజీవి

టీవీలు సమ్మె చేసినా సినిమా కలెక్షన్లు నిల్

# దీని భావమేమి తిరుమలేశా?

### మద్రాసు సినిమా వార్తలు

కేబుల్ టి.వి. ఆపరేటర్లు ఈ మధ్య నాలుగు రోజుల పాటు సమ్మె చేశారు. ఆ నాలుగు రోజుల్లోనూ సినిమా థియేటర్ల వద్ద కలెక్షన్లు ఏ మాత్రం పెరగలేదు. "పెదరాయుడు" వంటి సినిమా వస్తేగాని సినీ ప్రేక్షకులు ఆకర్షితులవటం లేదు. ఇతివృత్తం గొప్పగా ఉన్న చిత్రమే విజయ వంతమవుతుందని వేరే చెప్పనక్కర్లేదు.

## హృషికేశ్‌కు వెళ్తే రజనీకి మనశ్శాంతి

హృషికేశ్‌కు వెళ్లొచ్చాక తమిళ హీరో రజనీ కాంత్ ఎంతో ప్రశాంతంగా కనిపించాడు. "అవునండి అప్పుడప్పుడు టెన్షన్‌లకు దూరంగా హృషికేశ్‌కు వెళ్ళొస్తుంటాను. ఎంత మనశ్శాంతి లభిస్తుందో తెలుసా? నేను తొలుత 'భైరవి' అనే తమిళ చిత్రంలో నటించాను. ఆ చిత్రం విడుదలయ్యే వరకు నాకు టెన్షనే. దైవవశాత్తు అది విజయవంత మైంది. [illegible] చాలా కొత్త పిక్చర్లు వచ్చాయి. అన్నీ ఒప్పుకునే వాణ్ని. కొంత కాలం విశ్రాంతంగా 18 గంటలు చొప్పున పని చేశాను. బడలికతో మనశ్శాంతి కరువయ్యింది. అప్పుడే మందుకు అలవాటు పడ్డాను. ఒక్కోసారి ఫుల్ బాటిల్ కూడా ఖాళీ [illegible] క్రమక్రమంగా ఒకటిన్నర బాటిల్‌కు ఎదిగాను. అది కూడా చాలక డ్రగ్స్... మాండ్రెక్స్..., గంజాయి... వీటితో పాటు హమేషా జర్దా కిళ్లీలు... రోజుకు 40 పాకెట్లు! అటువంటి స్థితిలోనే మా ఆవిడ లతను కలుసు కోవడం జరిగింది. అప్పుడామె కాలేజీలో చదువు కుంటూండేది. వాళ్ళ కాలేజ్ సావనీర్ కోసం నన్ను ఇంటర్వ్యూ చేయడానికి వచ్చింది. మాటల్లో ఆమె హాస్య నటుడు వై.జి. మహేంద్రన్ భార్య చెల్లెలు అని తెలిసింది. ఇంటర్వ్యూలో ఆమె ప్రశ్నలడిగే తీరు నన్నెంతో ఆకర్షించింది. "మీ వివాహమెప్పుడు?" అని ఆమె అడిగింది. మీవంటి గుణవతి అయిన భార్య దొరికినప్పుడు అన్నాను. ఆమె రాసుకోవడం మానేసి నా వంక చూసింది. ఏమిటలా చూస్తారు! నేనడిగిన దాంట్లో తప్పేముంది? మీ వంటి భార్య దొరికితే ఎంత బాగుణ్ణు - అనిపించింది. అదే మీతో చెప్పాను తప్పా?" తప్పులేదు అందామె. ఐతే, మీ అభిప్రాయం చెప్పరేం? అని అడిగాను. ఆమె నవ్వుతూ కలాన్ని తన హేండ్ బాగ్‌లో పెట్టుకుంది. అంగీకరిస్తున్నట్లు తల ఊపింది. అలా ఆమె నా భార్య అయింది. ఇద్దరు పిల్లలను ప్రసాదించింది. తక్కువ చిత్రాలు చేయండి అంది. ఆమె మాట పాటిస్తూ వస్తున్నాను. అసలు మనశ్శాంతి కోసం హృషికేశ్‌కు వెళ్లి రావడం మంచిదని సూచించింది ఆమే. హృషికేశ్ నుంచి వచ్చినప్పుడల్లా నూతనో త్సాహంతో కనిపిస్తాను" అన్నారు రజనీకాంత్.

కొరవ 19 పేజీలో

# ఓటు వేసే వయసే రాలేదట!

మంచి మూడ్స్‌లో ఉన్నప్పుడు మీనా ఏదో కూనిరాగం తీస్తూంటుంది. "వివాహం గురించి ఆలోచిస్తున్నారా?" అని అడిగితే "ఏంటా? అప్పుడే వివాహమా?" అంటూ కిలకిలా నవ్వి "నా కోసం ఓ చోట తప్పకుండా పుట్టి ఈ పాటికి ఎక్కడో పెరుగుతుంటాడు. కాదన గలరా? అతన్ని వెతికి పట్టుకునే బాధ్యత మా తల్లిదండ్రులది. జన్మనిచ్చిన తల్లిదండ్రులు తప్పకుండా ఆ బాధ్యత నెరవేరుస్తారు. అవునా? ఈలోగా నేను తొందర పడవలసిన అవసరం ఏముంది? నాకింకా ఓటు వేసే వయసు కూడా రాలేదే. ఏది ఎప్పుడు జరగాలో తప్పకుండా అది అప్పుడు జరిగి తీరుతుంది. కాలానికి మనం తలఒగ్గక తప్పదు. ఏమంటారు?" అంది వేదాంత ధోరణిలో.

## అనగనగా ఒక రాజు

"గోవిందా... గోవిందా" చిత్రం సెన్సార్ విషయంలో జరిగిన వివాదం కారణంగా ఆ సెన్సార్ ఆఫీసర్ మన రాష్ట్రంలో ఉన్నంతవరకు తెలుగు చిత్రానికి దర్శకత్వం వహించనని రామ్ గోపాల్ వర్మ శపథం చేసిన విషయం పాఠకులకు గుర్తుండే వుంటుంది. ఐతే, అంతకు ముందుగా షూటింగ్ జరిపిన "అనగనగా ఒక రాజు" చిత్రాన్ని వర్మ పూర్తి చేయబోతున్నారు. ఇందులో చక్రవర్తి, ఊర్మిళ, రామిరెడ్డి, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, రఘువరన్, చలపతి రావు, వై.విజయ నటిస్తారు. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకుడు: రామ్ గోపాల్ వర్మ.

## మళ్లీ వెండి తెర మీద అమల

పెళ్ళయి, బిడ్డ తల్లి అయి, ఆ బిడ్డ కూడా సిసింద్రీ సినిమాలో నటించాక అమల ఇప్పుడు ఒక సినిమాలో నటించ బోతుంది. "అది మలయాళ సినిమా. నా పాత్ర ఎంతో గొప్పగా ఉంది. నిర్మాత అడిగితే కాదనగలనా? వెంటనే ఒప్పేసుకున్నా" అంది అమల.

# మల్లెమాల కళాతృష్ణకు మకుటం: అమ్మోరు!

చిత్రసమీక్ష — గ్రిద్దలూరు గోపాలరావు

యం.ఎస్. ఆర్ట్ మూవీస్ రథసారథి యం.ఎస్. రెడ్డి ఇది వరకు పౌరాణిక విజ్ఞానంతో కూడుకున్న మంచి చిత్రాలు చాలా నిర్మించారు. ఇప్పుడు దేవీ మహిమలతో క్షుద్రశక్తుల పై విజ్ఞానం చేస్తూ "అమ్మోరు" చిత్రాన్ని ఆంధ్ర ప్రజలకు సమర్పించారు.

మొదటి నుంచి ఎం.ఎస్. రెడ్డి గారి పట్టుదల చాలా గట్టిది. "అమ్మోరు" చిత్రం చాలా కాలంగా అవస్థల్లో చిక్కుకున్నా పట్టు విడని విక్రమార్కుడి వలె ఎక్కడా రాజీ పడకుండా నిర్మించారు. "అమ్మోరు" అనే వినూత్నమైన, విశిష్టమైన మహా ఫలం యం.ఎస్. రెడ్డి సాహిత్య హృదయమనే కల్పవృక్షానికి ఫలించి ఆంధ్రావనిలో రాలింది. ఆ ఫలం పలు రకాల కొత్తదనపు కమ్మదనాలతో, ఆకర్షణలతో, మాయలతో, దైవభక్తితో, ప్రేమానురాగాలతో, కక్ష సాధింపులతో, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణలతో నిండుకొని తెలుగు గుండెలను ఆకర్షించి అలరించింది. మానవ జీవితంలో విషాదాంధ కారాన్ని పారద్రోలేందుకు, దైవ వికాసానికి, భగవద్భక్తి సంపూర్ణతకు మారు పేరుగా నిలుస్తుంది "అమ్మోరు".

తెరలో ఉవ్వెత్తున ఉరకలు వేసే ఆశ్చర్య సన్నివేశంతో, ఎంతటి ప్రకర్షతో, ప్రావీణ్యంతో సాహితీ శిఖరా లధిరోహించి డాక్టరేట్ అందుకున్న సందర్భంగా ఈ జనరంజకమైన చిత్రాన్ని సమర్పించిన ఆయన కళా హృదయాన్ని ప్రశంసించక తప్పదు.

యం.ఎస్. రెడ్డి కుమారుడు యం. శ్యాంప్రసాద్ రెడ్డి ఈ చిత్రానికి నిర్మాత. తండ్రి, తనయుల ప్రత్యేక శ్రద్ధతో కూడిన ఈ విశిష్ట ప్రయత్నానికి ప్రజల అండ దండలు దండిగా లభిస్తున్నాయి.

పెద్దగా చదువులేక పోయినా అమ్మోరు చిత్రానికి సంబంధించిన కథను యం.ఎస్. ఆర్ట్ మూవీస్ వ్రాసింది అంటే తండ్రి తనయుల పదునైన మేధ నుంచి కథ ఉద్భవించిందన్నమాట.

సూర్యం (సురేష్) తన అక్క మాట కాదని తాను ప్రేమించిన భవానీని (సౌందర్య) పెళ్లి చేసుకుంటాడు. తన కుమార్తెను చేసుకోకుండా భవానీని పెళ్ళి చేసుకున్నందుకు సూర్యం అక్క ఉగ్రురాలవుతుంది. దుర్గా మాత భక్తురాలని కూడా చూడకుండా తన కూతురుతో కలిసి భవానీని చిత్రహింసలు పెడుతుంది. ఆమెను చంపేందుకు ప్రయత్నిస్తారు వారు. ఇది ఇలా వుండగా తన దుష్ట కార్యాలకు అడ్డు తగులుతూ వుందనే ఆగ్రహంతో గోరక్ (రామిరెడ్డి) అనే క్షుద్ర మాంత్రికుడు భవానీ పై కక్ష సాధింపుకు దిగుతాడు. తన భక్తురాలైన భవానీని ఆదుకునేందుకు దుర్గా మాత బాల దుర్గ రూపం దాల్చి భవానీ ఇంట్లో అడుగు పెడుతుంది. సూర్యం అక్క ఆగడాలను, గోరక్ మాయ మంత్రాలను బాల దుర్గ తన దైవశక్తితో ఎదుర్కొంటూ వుంటుంది. బాల దుర్గ లేకపోతే తన కష్టాలు తగ్గుతాయని భవానీ బాల దుర్గను ఇంట్లో నుంచి తీసుక వెళ్లి దుర్గ గుడిలో వదిలేస్తుంది. బాల దుర్గ, దుర్గ విగ్రహంలోకి లీనమవుతుంది. ఆ తర్వాత గోరక్ భవానీని, సూర్యాన్ని నానా హింసలు పెడ్తాడు. గోరక్ దుర్మార్గాలను సహించలేని బాలదుర్గ, దుర్గా దేవిగా రూపం దాల్చి (రమ్యకృష్ణ) దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ జరుపుతుంది. భవానీని సౌభాగ్యాన్ని కాపాడుతుంది.

క్షుద్రశక్తులకు, దైవ భక్తులకు జరిగే సంఘర్షణలతో కూడుకున్న చిత్రాలు ఇది వరకు ఎన్నో వచ్చాయి. ఆ చిత్రాల్లో దుష్ట శక్తుల చర్యలు, దేవతా మహిమలు, భక్తుల బాధలు, పాత ధోరణిలో చూపబడ్డాయి. కాని ఈ చిత్రంలో దర్శకుడు కోడి రామకృష్ణ శాస్త్రీయ పద్ధతులతో, [illegible] చర్యలు, మహిమలను అతి నూతనంగా చిత్రీకరించారు. ఈ దృశ్యాలన్నీ ప్రేక్షకులను ఆకర్షించి ఆకట్టుకుంటాయి. కొత్త పద్ధతితో, వైవిధ్యంగా వివిధ దృశ్యాలను రూపొందించిన దర్శకుడు అభినంద నీయుడు.

రామిరెడ్డి ఒక ప్రత్యేక బాణీలో నటించాడు. గోరక్ పాత్ర ఆయన నట జీవితంలో ఒక మైలురాయి. సౌందర్య కూడా గొప్పగా నటించింది. భవానీ పాత్ర ఆమె నట జీవితాన్ని చిర కాలాల పాటు నిలుపు తుందని చెప్పుకోవచ్చు. సురేష్ ఉన్నంతలో బాగా నటించాడు. రమ్యకృష్ణకు ప్రాముఖ్యత లేదు. సూర్యం అక్క పాత్రధారిణి గయ్యాళి తనం భయంకరంగా వుంది. బాల దుర్గగా బేబి సునయన సహజంగా నటించింది.

సత్యానంద్ మాటలు పాత్రోచితంగా సరితూగాయి. సి. విజయ కుమార్ కెమెరా మలచిన జాతర దృశ్యం, ఇతర మాయా దృశ్యాలు ప్రేక్షకులను ఆకర్షిస్తాయి.

మల్లెమాల (ఎం.ఎస్. రెడ్డి) వ్రాసిన పాటలు సాహిత్యపు విలువలతో చక్రవర్తి శ్రీ సంగీతంలో వినసొంపుగా వున్నాయి.

"అమ్మోరు" చిత్రాన్ని యం.ఎస్. రెడ్డి, యం. శ్యాంప్రసాద్ రెడ్డిలూ కలిసి సినీ కళామ తల్లికి ఒక అమూల్య ఆభరణంగా అలంకరించారు.

# మా సుబ్బరామన్నకు అశ్రుతర్పణం



అడిగిన వారికి లేదనకుండా ఎన్నో వేల
మందికి సహాయం చేసిన అపర దానకర్ణుడు,
విద్యాదాత, మాకెంతో ఆత్మీయులు

**మాగుంట సుబ్బరామరెడ్డిగారి**

ఆకస్మిక మరణం మాకు తీరని లోటు వారి
ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని
భగవంతుని ప్రార్థిస్తూ, వారి కుటుంబానికి
మా ప్రగాఢ సానుభూతి తెలియచేస్తున్నాము.

**S.V.S. రాఘవేంద్ర రావు,** B.Com., B.L. (రఘు)
**Sales Tax Consultant**

---

# ఏమని చెప్పి ఓదార్చగలము?



**మాగుంట సుబ్బరామరెడ్డి గారు**

*ప్రజల కన్నీటి వరదలో*
*జన విలాపాల పడవ నెక్కి*
*అమరపురికి పయనమై పోయారు మీరు-*

*మీ మహిమాన్విత వ్యక్తిత్వం నీడలో తలదాచుకొని*
*మీ పరోపకార దృక్పథం అండతో బ్రతుకుతెరువు వెతుక్కొని*
*మనుషులుగా నిలవగల్గుతున్న జనమెందరో*
*మీరు లేరనే ఆవేదనతో కుమిలిపోతారని,*
*అనాథలుగా మిగిలిపోతారని మర్చిపోయారు!*

*వారందరినీ ఎట్లా ఓదార్చమంటారు?*
*వారందరికీ రేపటి నుంచి ఎవరు దిక్కుగా వుంటారు?*
*మీ ఆత్మకు శాంతి కల్గాలని భగవంతుని వేడుకుంటూ-*

అశ్రుతప్తనయనాలతో

**వేమిరెడ్డి కోటారెడ్డి** **వేమిరెడ్డి ప్రభాకరరెడ్డి**

కాంట్రాక్టర్స్
రామమూర్తినగర్, నెల్లూరు.

## జనవాణి

3 పేజీ కొరవ

### మహావృక్షం నేలకొరిగింది

ఎంతో మందికి నీడ కల్పించిన ఒక మహావృక్షం నేలకొరిగి పోయింది. వివాద రహితుడు, అందరికీ ఆప్తుడైన మాగుంట సుబ్బరామ రెడ్డిని ముష్కరులు ఎందుకు చంపారో కారణం తెలియడం లేదు. ప్రజల కోసం పనిచేస్తున్నామని చెప్పే నక్సలైట్లు ఈ హత్య విషయమై ప్రజలకు ఏ ముఖం పెట్టుకొని సంజాయిషీ చెబుతారు? నలుగురితో మంచిగా ఉండమని పెద్దలు చెబుతుంటారు. ఎందరో ప్రజల అభిమానం పొందబట్టే జన సముద్రం అమాంతంగా తరలి వచ్చి మాగుంటకు కడసారి శ్రద్ధాంజలి ఘటించారు. మహిళలు సైతం స్మశానానికి తరలి రావడం ఇంత వరకు సింహపురి చరిత్రలో సంభవించలేదు. 49 ఏళ్ల చిరు ప్రాయంలో జిల్లాకు వెలుగులా వుండిన ధృవతార వంటి సుబ్బరామ రెడ్డి గారి పోవడం తీరని లోటు.

నెల్లూరు -ఎస్. కిరణ్

### దుర్భిణి వేసి వెతికినా కనపడరు

నెల్లూరు జిల్లాలో ఎప్పుడో ఆంచూరి సుబ్బానాయుడు దాన ధర్మాలు చేసాడని, పెళ్లిళ్లు ఘనంగా చేశాడని కథలుగా చెప్పుకొంటే విన్నాం. తర్వాత హయాంలో రేబాల లక్ష్మి నరసారెడ్డి దాన కర్ణుడిగా బిరుదు పొందారని పత్రికల్లో వ్రాస్తే చదివాం. కాని వీరి దాన ధర్మాలు కొంత వరకే పరిమితమై వుండినాయి. కాని నక్సల్ ఘాతుకానికి ప్రాణాలు కోల్పోయిన మాగుంట సుబ్బరామ రెడ్డి వంటి దాతృత్వం కల్గిన వ్యక్తి వందల ఏళ్ళ చరిత్ర కల్గిన సింహపురిలో దుర్భిణి వేసి వెతికినా కనపడరు. సంపాదించడం గొప్ప కాదు. ఆ సంపదలో దాన ధర్మాలకు ఎక్కువ మొత్తం కేటాయించడం అందరి వల్లా కాదు. అది సుబ్బరామ రెడ్డి వంటి వారికే సాధ్యమయ్యింది. ఈ మధ్య ఆయనను ఒక ప్రత్యేక రాజకీయ వర్గంగా పేర్కొన్నా ప్రత్యర్థి వర్గం పై ఏనాడూ పరుష విమర్శ చేయని అరుదైన రాజకీయ జీవి మాగుంట సుబ్బరామ రెడ్డి.

బుచ్చి - జనవాక దయాకరరెడ్డి

### చిరస్మరణీయుడు సుబ్బరామరెడ్డి

నిష్కళంక ప్రజా సేవకుడు, పేద ప్రజల్లో నిజంగా దైవాన్ని చూసిన మహాను భావుడు మాగుంట సుబ్బరామ రెడ్డి. భౌతికంగా ఆయన మన మధ్య లేకపోయినా ఒంగోలు పార్లమెంటు నియోజక వర్గంలోని మెట్ట ప్రాంత గ్రామ ప్రజల గుండెల్లో చిరస్మర ణీయుడిగా నిలిచి పోతారు. రక్త మాంసాలకు అలవాటు పడ్డ పులి మారదన్న చందాన హత్యలకు అలవాటు పడ్డ నక్సలైట్ల పై నిషేధాన్ని ఎన్టీఆర్, చంద్రబాబు ప్రభుత్వాలు ఎత్తివేయడం వల్ల ఈ ఘాతుకం జరిగింది. ఇప్పటికైనా అన్ని రాజకీయ పార్టీలూ ఒక నిర్ణయానికి వచ్చి పీపుల్స్ వార్ గ్రూప్ పై నిషేధాన్ని విధించ వలసి వుంది.

నెల్లూరు -వి. రవికుమార్

### నెల్లూరు రియల్ ఎస్టేట్ పై నిర్భయంగా వ్రాసారు

నెల్లూరు రియల్ ఎస్టేట్స్ పై రెండు వారాలుగా ముక్కు సూటిగా వ్రాసి ప్రజల కళ్లు తెరిపించారు. ప్రజలకు అత్యంత అవశ్యమైన ఈ విషయం పై మీరు చూపిన ధైర్యానికి అభినందనలు. ఇప్పటికీ రియల్ ఎస్టేట్స్ వ్యాపారులు కల్లబొల్లి మాటలు చెప్పి ప్రజలను వంచించాలని చూస్తున్నారు. బాధితులు తమ సైకలు రాబట్టుకొనే మార్గాలు కూడా న్యాయ పరమైన సలహాలతో జమీన్ రైతులో ప్రకటించి పుణ్యం కట్టుకొంటి.

నెల్లూరు -కె. ప్రభాకరరావు

### జేమ్స్‌గార్డన్ వాసుల వెతలు తీరవా?

నెల్లూరు పట్టణానికి ఆటో నగర్ వుంది. బైపాస్ రోడ్డులోని పెన్నా కాలువ బ్రిడ్జి ప్రక్కన బర్మా షెల్ గుంటలో లారీ స్టాండు వుంది. కాని మునిసి పాలిటీ టౌన్ ప్లానింగు, ప్రజారోగ్య శాఖ అధికారులకు ఎన్ని పర్యాయాలు హెచ్చరిక చేసినా, నివాస గృహాలు వుండే జేమ్స్ గార్డన్ పబ్లిక్ వీధులలో లారీ రిపేర్లను నిరోధించే ప్రయత్నమే చేయడం లేదు. జేమ్స్ గార్డన్ వాసులు గ్రీన్‌బెల్ట్ కమిటీని స్థాపించుకొని రోడ్లకు ఇరువైపులా మట్టితో ప్లాట్ ఫారాలు నిర్మించుకొని వాటి మీద నీడనిచ్చే చెట్లను నాటుకొని ఆ ప్రాంతాన్ని పార్కు లాగా తయారు చేసుకొన్నారు. కాని నివాస గృహాలు వున్న ఈ వీధులలో లారీల రిపేరు బెడద తొలగి పోలేదు. లారీల ట్రాఫిక్ విపరీతంగా వున్నందువల్ల పోస్టుబాక్స్ వీధిలో మాకాటి లోతు గుంటలు ఎక్కువై ఈ ప్రాంతీయులకు తీవ్ర అసౌకర్యం కలుగుతున్నది. ఈ సమస్యకు పరిష్కారమే లేదా?

నెల్లూరు -పి. శ్రీనివాసులురెడ్డి

### శివారెడ్డి పద్యాలు

అనారోగ్యం వల్లనో, కంటి చూపు తగ్గిన దానివల్లో లేక వయో భారమో ఇటీవల కాలంలో జమీన్‌రైతుకు పద్యాలు వ్రాయడం శివారెడ్డి చాలా మటుకు తగ్గించేశారు. ఏదో ముక్త సరిగా వ్రాస్తున్నారు. కాస్త ఓపిక తెచ్చుకొని ఇంక నాలుగు పద్యాలు ఎక్కువ వ్రాసి రాష్ట్ర వ్యాప్తంగా వున్న ఆయన అభిమానులను తృప్తి పరచాలి. శివారెడ్డి గారికి సద్గురు భగవాన్ రమణ మహర్షి గారు ఆయురా రోగ్యాలను, మనశ్శాంతిని అనుగ్రహించాలని కోరు కుంటున్నాను.

మార్కాపురం -వి. రామచంద్రరావు

### కలెక్టర్‌ని నియమించండి

నెల్లూరు జిల్లా మూడు నెలలుగా కలెక్టరు లేక అనాథగా వుంది. జాయింట్ కలెక్టర్ ఎ. గిరిధర్ చురుకైన యువకుడైనా ఎన్ని పనులని భరాయించ గలడు! ఆయనకు తీరిక లేక పోవడం వల్లనే పి.డబ్ల్యు.డి శాఖాధి కారులు ఆడించే ఆట, పాడించే పాటగా వుంటున్నది. జిల్లాలో సమయానికి వర్షాలు పడక పోవడం వల్ల వ్యవసాయ పనులకు అనువుగా రైతులకు నీటిని వదలడం లేదు. ఈ శాఖాధి కారులకు నీటిని అమ్ముకోవడం అలవాటు. గాని ఇంతకు ముందు కలెక్టర్లు సుజాతా రావు, జన్నత్ హుసేన్, రాజా, సాంబశివ రావు ప్రత్యేక శ్రద్ధ వహించి ఈ పని చేయకుండా చేసారు. ఇప్పుడున్న పరిస్థితి కొనసాగితే జిల్లాలో పంటలన్నీ నీరులేక ఎండిపోయి ధాతు కరువు తప్పేట్లు లేదు. లేకుంటే జనవరి నెలలో బంగళాఖాతంలో తుఫాన్ అయినా పుట్టాలి. ప్రజా ప్రతినిధులు సక్రమ నీటి సరఫరా విషయమై సరిగా స్పందించడం లేదు. మంచి చురుకైన వ్యక్తిని కలెక్టర్‌గా నియమింప జేస్తే నీటి పారుదల శాఖ అధికారుల నుంచి రైతులను రక్షించిన వారవుతారు.

గూడూరిపాళెం -ఈపూరు వెంకురెడ్డి

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

బహిరంగ సభలో గురునాథం, మహానంద, ఓరుగంటి, చిన్నయ్య గారలు మాట్లాడారు. హరిజన వాత సభలో షణ్ముగం, చిన్నయ్యలు మాట్లాడారు.

### వార్‌బాండ్లు

వార్‌బాండ్ల గోల పెద్దదిగా వుంది, ధనవంతుల వద్ద వసూలు జేయడం సరే. పేద బిక్కి వద్ద వసూలు జేయడం అక్రమం. పైన చిన్న వారి వద్ద వసూలు జేసే రు. 10, 20 ల పద్దులు దాఖలా మఖాబిలా లేదు. ఆ చిన్న మొత్తాలను పెద్ద మొత్తాలిచ్చే సాహుకార్లకు కమీసన్ క్రింద యిస్తున్నారట. ఇదా చాలా ఘోరం ఆ చిన్న మొత్తాలకు సేవింగ్సు సర్టిఫికెట్లో, పోస్టల్ సర్టిఫికెట్లో యిప్పించడం ధర్మం, దర్శి నుంచి గూడా ఫిర్యాదులు వస్తున్నవి.

### దామరమడ్గు పోస్టుమాస్టరు

యిది అరితేరిన ఘటం, బాపన పాడుకు జమీన్ రైతును సంవత్సరాల తరబడి పంపడు, వాండ్ల వుత్తరాలు గూడ అంతేనట. కాగొల్లు పాటికి పంపడం, అవి అక్కడే హత మణిగి పోవడం జరుగుతున్న అచారం. వారి పేరుతో ఉత్తరాలు వ్రాశాం. పోస్టల్ కంప్లెంటు చేశాం, ఆ వ్యాధి యిప్పటికి కుదరలేదు. పోస్టల్ ఇన్‌స్పెక్టరు వారు బాపన పాడు చెన్నారెడ్డి నర్సారెడ్డిని విచారించి తగు చర్య బుచ్చుకొన వలెను.

### నెల్లూరు హెల్తు

పరిశుద్ధమైన కొవ్వుతో తయారు చేయబడిన నేతని వీధుల్లో స్వేచ్ఛగా అమ్ముతున్నారు.

-విమర్శకుడు

### ఉర్లగడ్డలు రూపాయా?

రామమూర్తి గారుండే ఊరులో వుర్లగడ్డలు వీసె 1 కి ఒక రూపాయ లెక్కను గడగట్టి అమ్ముతున్నారు మార్కెట్టులో.

### మాన నష్టం, నష్టమైంది

యల్లయపాళెంలో సుబ్బరామ రెడ్డి గారు బొబ్బా శంకర రెడ్డి మీద పొందిన మాన నష్టం డిక్రీని, అప్పీలులో జిల్లా కోర్టు తోసి వేసింది.

### మో చెయ్యి జూపిందెవరండి?

పురిణి గ్రామంలో గాంధీ ఉత్సవం అనే పేరిట ఒక వూరేగింపు జరిపి, బాజా, భజంత్రీలకు మో చెయ్యి జూపిందెవరండి? స్టోరులలో గుడ్డలు తక్కువ ధరలకు తెచ్చి ఎక్కువ ధరలకు అమ్మిన దొర లెవరండి?

కామిరేడులా యీ చిలిపి కార్యములకు దిష్టలును, ధీరులును మెచ్చి బెట్టువారు

### కొత్త పాలన

సీమ దొరతనం అనంతరం స్వదేశ పరిపాలన మాదిరి, యువకుడు, దేశాభిమాని ఖద్దరు గుడ్డలతో మునసబు సీటుకు వస్తున్నారు సోమిరెడ్డి చిన వీరారెడ్డి. నువ్వయితే పేదా బిక్కిని చూచి కాపాడు తావను కుంటున్నారు నాయనా ఎట్ల జేస్తావో!

## న్యూస్‌ప్రింట్

2 పేజీ కొరవ

వారందుకు ప్రయత్నిస్తున్నారు. ఒక్కొక్క షేరుకు 5 షేర్ల లెక్కన రైట్స్ పద్ధతిలో రు. 25 ల ప్రీమియంతో అలాట్ చేస్తారు. దీనితో బ్యాంకు ఈక్విటీ 15.86 కోట్లకు పెరుగుతుంది.

దేశంలోని ప్రైవేటు బ్యాంకులలో అత్యంత శీఘ్రంగా అభివృద్ధి చెందుతున్న సంస్థ వైశ్యా బ్యాంకు. ఇప్పుడు వారి దగ్గర రు. 5187 కోట్ల డిపాజిట్లు వున్నాయి. రు. 2709 కోట్ల అప్పులు ఇచ్చారు. బ్యాంకు ఆదాయం 562 కోట్లు; నికర లాభం 101 కోట్ల రూపాయలు. ఈ మధ్య కాల్‌మనీ రేట్లు విపరీతంగా పెరిగిన సమయంలో వైశ్యా బ్యాంకు మంచి లాభా లార్జించింది.

త్వరలో వీరు పబ్లిక్ ఇష్యూ కూడా విడుదల చేయనున్నారు. అప్పుడు ఈక్విటీ బాగా పెరుగు తుంది. ఈక్విటీ పెరిగితే, షేరుకు ఇప్పుడున్న అప్రిషియేషన్ వుండక పోవచ్చు.

## పంచాంగం

గురుమౌఢ్యమి జరుగుచున్నది. ఈ వారం నుండి గురువు ధనస్సు రాశి, రాహు కేతువులు కన్యా మీనా రాశులందు సంచారము.

### డిసెంబరు తిథులు

మార్గశిర బహుళ

| | | |
|---|---|---|
| తే 9 శని విదియ | ఉ.గ. | 9.20 వ |
| తే 10ఆది తదియ | ప.గ. | 11.32 వ |
| తే 11సోమ చతుర్థి | ప.గ. | 1.30 వ |
| తే 12 మంగళ పంచమి | ప.గ. | 3.20 వ |
| తే 13బుధ షష్ఠి | సా.గ. | 5.05 వ |
| తే 14గురు సప్తమి | సా.గ. | 5.35 వ |
| తే 15శుక్ర అష్టమి | సా.గ. | 5.53 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు.ఎం.ఎ

# నెల్లూరు సంగతులు

6 పేజీ తరువాయి

పుర్యమంలో ఎన్ని విమర్శలు వచ్చినా తొణకక, బెణకక నిల్చున్న ఇన్‌ఛార్జి కలెక్టర్ అనెముల గిరిధర్ నేతృత్వంలో చిన్న పిల్లలో పోలియో ... అరికట్టేందుకు జిల్లాలో పల్స్ పోలియో కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగా చేపట్టారు. జిల్లా అంతటా ఇప్పటికే సమావేశాలు పెట్టి మూడేళ్ల లోపున్న బిడ్డల తల్లుల్ని ఈ కార్యక్రమం వైపు మళ్లించే యజ్ఞానికి శ్రీకారం చుట్టారు. ఇన్‌ఛార్జి కలెక్టర్ చొరవ మూలాన జిల్లాలో ఈ కార్యక్రమం విజయవంతమయ్యే అవకాశాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ప్రజలను చైతన్యవంతులను చేసేందుకు 5 తేది టౌన్‌లోని వివిధ స్కూళ్ల పిల్లలతో కలెక్టర్, మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, డాక్టర్లు, వివిధ ప్రభుత్వ శాఖలలోని ఉద్యోగులు జరిపిన ప్రదర్శన సూపర్ సక్సెస్ అయ్యింది.

25 లక్షల జనాభా కల్గి వున్న నెల్లూరు జిల్లాలో రెండు లక్షలా ఐదు వేల మంది మూడు సంవత్సరాల లోపు పిల్లలున్నారట. వీరికి పోలియో చుక్కలు ఈ నెల 9 తేది, జనవరి 20 తేది వేసేందుకు అన్ని ఏర్పాట్లు చేసినట్లు జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారిణి డాక్టర్ ఊర్మిళ 1 తేది పత్రికల వారికి చెప్పారు. రెండు దశలుగా వేసేందుకు 5 లక్షల 60 వేల మందికి సరిపోయేట్లు పోలియో మందును సేకరించి భద్రపరచినట్లు చెప్పారు. జిల్లాలో అన్ని గ్రామాల్లో ఈ చుక్కలు వేసేందుకు 2335 పోలియో సెంటర్లు ఏర్పాటు చేస్తున్నారు. నెల్లూరు, గూడూరు, కావలి టౌనలో 350 చోట్ల ఈ సెంటర్లలో 10,600 మంది ప్రభుత్వ సిబ్బంది, 24 వేల మంది వాలంటీర్లను సిద్ధం చేసి వుంచారట. పోలియో మందులను ఏర్పాటు చేసిన కేంద్రాలకు తీసికొని పోయేందుకు 3200 ఫ్లాస్కులు, ఛస్ బాక్సులు సేకరించి వుంచారట. ఈ కార్యక్రమ నిర్వహణకు మాగుంట ఛారిటబుల్ ట్రస్ట్ లక్షా 72 వేలు, మార్కెటింగ్ శాఖ ద్వారా 60 వేలు, ప్రాథమిక సహకార సంఘాల ద్వారా 50 వేలు, జిల్లాలోని బ్యాంకులు 1200 ఫ్లాస్కులు, జిల్లా అధికార్లు తమ జీతంలో 10 రూపాయలు, ఉద్యోగస్తులు 5 రూపాయల వంతున ఇచ్చి సహకరిస్తున్నారట. ప్రచారం కోసం 5 వేల బ్యానర్లు, 200 సినిమా స్లైడ్లు 120 వాహనాలు సిద్ధం చేశారు. కార్యక్రమానికి జిల్లా కో ఆర్డినేషన్ కమిటీ ఛైర్మన్‌గా జిల్లా కలెక్టర్ వ్యవహరిస్తారని వైద్య శాఖాధికారిణి డాక్టర్ ఊర్మిళ వివరించారు.

## ప్రజల వద్దకు పాలనలో అధికారుల తీరు బేష్

మొదటి విడత ప్రజల వద్దకు పాలన కార్యక్రమంలో నోడల్ అధికారులు చూపిన శ్రద్ధను ఇన్‌ఛార్జి కలెక్టరేట్ ఎ. గిరిధర్ మెచ్చుకొన్నారు. 4 తేది కలెక్టర్ ఆవరణలోని సైక్లోన్ మీటింగు హాలులో జరిగిన 20 సూత్రాల కార్యక్రమాల సమీక్షా సమావేశంలో మాట్లాడా రాయన. ఈ నెల 11 తేది నుండి నిర్వహించనున్న ప్రజల వద్దకు పాలన రెండవ విడత కార్యక్రమంలో కూడా మొదటి కార్యక్రమం మాదిరి అధికారులు శ్రద్ధ తీసుకొని ప్రజల అవసరాలు తీర్చాలన్నారు. జిల్లా అధికారులు అభివృద్ధి కార్యక్రమాల అమలులో నిర్దేశించిన లక్ష్యాల మేరకు పూర్తి చేయడానికి కృషి చేయాలని కోరారు. జిల్లాలో నవంబర్ మాసాంతానికి జిల్లాలో జరిగిన అభివృద్ధిని సమీక్షిస్తూ, జవహర్ రోజ్‌గార్ యోజనా పథకం ద్వారా 5 కోట్ల 85 లక్షల 63 వేల రూపాయలు ఖర్చు చేసి 10 లక్షల 94 వేల 700 పని దినాలు కల్పించినట్లు చెప్పారు. లక్ష్యాలను మించి 723 చిన్న తరహా పరిశ్రమలను నెలకొల్పినట్లు వివరించా రాయన. సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం క్రింద కోటి 3 లక్షల 63 వేల రూపాయల ఖర్చు చేయడం వల్ల 718 మంది ఇప్పటి వరకు లబ్ధి పొందినట్లు చెప్పారు. 1307 మందికి 308 ఎకరాల మిగులు భూమి, 44,573 మంది గర్భిణీ స్త్రీలకు వ్యాధి నిరోధక టీకాలు వేసినట్లు తెలిపారు. పక్కా గృహాల నిర్మాణం క్రింద ఒక్కొక్క ఇంటికి 11 వేల 500 రూపాయల ఆర్థిక సహాయం అందించి గూడూరు గూడూరు, కావలి, నెల్లూరు టౌన్‌లలో 503 పక్కా గృహాలు నిర్మాణం పూర్తి చేసారట. ఎస్‌సి కార్పొరేషన్‌కు కోటి 90 లక్షలు, బిసి కార్పొరేషన్‌కు విడుదలై వున్న లక్షలాది రూపాయల నిధులను గత సంవత్సరం ఖర్చు పెట్టలేదని శాసన సభ పర్యవేక్షణ కమిటీ ద్వారా అక్షింతలు వేయించుకొన్న అధికారులు, ఈసారి కూడా ఆ నిధులను తిరిగా ఖర్చు పెడుతున్నారు. ఈ విషయమై కలెక్టర్ శ్రద్ధ వహించాలని సూచన.

## వినియోగదార్ల సంఘాలు చురుకుగా పనిచేయాలి

...జాతమ్మ కాలనీలో స్థాపించిన ఆదర్శ వినియోగ దార్ల సంఘ సమావేశం వినియోగ దారుల జిల్లా ఫోరం సభ్యురాలు శ్రీమతి ఇసనాక నీరజ అధ్యక్షతన 26 తేది జరిగింది. జిల్లా ఫోరం అధ్యక్షుడు కె. సిద్దారెడ్డి 1986 రక్షణ చట్టాన్ని గూర్చి చెబుతూ ఏవి కేసులు వినియోగ దార్ల కోర్టుల పరిధిలోనికి వస్తాయో చక్కగా వివరించి, అనుచిత వ్యాపారస్తులకు ఎటువంటి శిక్షలు పడతాయో తెలియ జేశారు. జిల్లా పౌర సరఫరాల అధికారి ఎం. భరత్ రెడ్డి మాట్లాడుతూ ఆదర్శవంతమైన భావాలు కల్గిన మహిళలతో ఏర్పాటు చేసిన ఆదర్శ వినియోగ దార్ల సంఘాలు నిత్యావసర వస్తువులు, రేషన్ షాపు డీలర్లు సక్రమంగా పంపిణీ చేసేందుకు శ్రద్ధ వహించాలన్నారు. వినియోగ దార్ల సంఘాలు చురుకుగా పనిచేస్తే అధికారులుగా తమ వంతు సహకారం అందిస్తామన్నారాయన. సంఘం అధ్యక్షురాలు వై. సౌజన్యమ్మ తొలుత స్వాగతం పలుకగా, కార్యదర్శి స్వరాజ్యలక్ష్మి చివరన వందనాలు చెల్లించారు.

## సైన్యంలో పనిచేసేందుకు యువకుల ఎంపిక

సైన్యంలో పని చేసేందుకు ఉత్సాహం వున్న నెల్లూరు, కడప, అనంత పురం జిల్లా పరిధిలోని యువకులను ఎంపిక చేసేందుకు డిశంబరు 12 తేది నుండి 16 వరకు ఎసి సుబ్బారెడ్డి స్టేడియంలో శారీరక పరీక్షలు నిర్వహిస్తున్నారు. 12 తేది పేర్లు నమోదు చేసుకొంటారు. 13 తేది శారీరక పరీక్ష నిర్వహిస్తారు. జనవరి 28 తేది ఉదయం గుంటూరు బ్రాంచి కార్యాలయంలో వ్రాత పరీక్ష నిర్వహిస్తారు. ఎంపికకు హాజరయ్యే అభ్యర్థులు 1996 ఫిబ్రవరి నెలాఖరు నాటికి 16 సంవత్సరాల నుండి 21 మధ్య వయస్సు కలిగి వుండాలి. ఎత్తు 165 సెంటి మీటర్లు, బరువు 50 కేజీలు, ఛాతి - 77 - 82 సెంటి మీటర్ల మధ్య వుండి, పదవ తరగతి పాసై వుండాలి. ఎంపికకు వచ్చే వాళ్లు 4 పాస్‌పోర్టు సైజు ఫోటోలు, విద్యార్హతల ఒరిజినల్, జిరాక్స్ కాపీలతో గ్రౌండ్‌లో హాజరు కావాలని గుంటూరు జోన్ బ్రాంచి రిక్రూట్‌మెంట్ ఆఫీసు లెఫ్టినెంట్ కల్నల్ ఎన్. మొహంతి తెలియ జేస్తున్నారు.

## బియిడి అభ్యర్థులకు పార్ట్‌టైమ్ ఉద్యోగాలు

సైన్స్, ఆర్ట్స్ గ్రూపులలో బియిడి చేసిన మహిళా అభ్యర్థినుల నుండి పార్ట్ టైమ్ టీచర్స్‌గా పని చేసేందుకు జిల్లా స్త్రీ, శిశు సంక్షేమ శాఖాధికారిణి దరఖాస్తులు కోరుతున్నారు. 500 రూపాయల జీతం ఇస్తారట. ఆసక్తి గల వారు డిశంబరు 11 తేది ఉదయం 11 గంటలకు ఎ.కె నగర్ వాటర్ ట్యాంకు వద్ద గల స్త్రీ సేవా సదనంలో ఒరిజనల్ సర్టిఫికేట్స్‌తో ఇంటర్వ్యూలకు హాజరు కావచ్చంటున్నారు.

## గురుకుల పాఠశాలకు ప్రవేశ పరీక్ష

కోటలోని గిరిజన గురుకుల పాఠశాలలో 3, 4 తరగతుల్లో ప్రవేశానికి 15 తేది ప్రవేశ పరీక్ష నిర్వహిస్తున్నారు. పూర్తి వివరాలను నెల్లూరు డి.ఇ.ఒ. ఆఫీసులో తెలుసుకొని దరఖాస్తులను ప్రిన్సిపల్, గురుకుల పాఠశాల, కోట, చిట్టేడు మండలానికి పంపవచ్చునని డి.ఇ.ఒ. తెలియ జేస్తున్నారు.

## ముస్లింల నిరసన ప్రదర్శన

ధ్వంసం చేసిన బాబ్రీ మసీదు స్థానే మసీదును తిరిగి పునర్నిర్మించాలని మరో ఐదు డిమాండ్లతో జిల్లాలోని వివిధ ముస్లిం సంఘాల ఆధ్వర్యంలో 6 తేది టౌన్‌లో భారీ ప్రదర్శన నిర్వహించారు. షాదీ మంజిల్ నుండి ప్రారంభమైన ప్రదర్శన కోటమిట్ట, బారకాసు, చిన్నబజారు, సంతపేట, ఎసిబొమ్మ, గాంధీ బొమ్మల మీదుగా కలెక్టరేట్‌కు చేరి అక్కడ ఇన్‌ఛార్జి కలెక్టర్‌కు వినతి పత్రం సమర్పించారు. అక్కడి నుండి టౌన్‌హాల్ వెళ్లి బహిరంగ సభ నిర్వహించారు. ముస్లిం పర్సనల్ లా'లో జోక్యం చేసుకో కూడదని, మశీదు కూల్చివేతకు కారకులైన వారిని శిక్షించాలని, దేశంలోని అన్ని మతాల ప్రార్థనా స్థలాలకు రక్షణ కల్పించాలని, మైనారిటీల పై ప్రయోగిస్తున్న నిర్బంధిత చట్టాలు ఉప సంహరించాలని, ముస్లింలకు రిజర్వేషన్ కల్పించాలని వినతి పత్రంలో పేర్కొన్నారు. ఈ కార్యక్రమానికి జిల్లా ముస్లిం మైనారిటీ సంక్షేమ సంఘం అధ్యక్షుడు షేక్ మొహియుద్దీన్, సయ్యద్ షేక్ అక్రం, దళిత మహాసభ మస్తానయ్య, ఎం.ఎ. ఖాదర్, కౌన్సిలర్లు షఫీ, మునాఫ్ తదితరులు నాయకత్వం వహించారు.

## సినిమా

15 పేజీ తరువాయి

## "పెద్దాయన పెళ్ళి" చిత్రంలో జంటలు

గుంటూరు పంపిణీ ... నిర్మించే "పెద్దాయన పెళ్ళి" చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ జగపతి బాబు, రమ్యకృష్ణ ముఖ్య పాత్రధారులు.

## జయచిత్ర దర్శకత్వంలో తదుపరి చిత్రం

"కాలం కలిసి వస్తే అతి త్వరలోనే నా దర్శకత్వంలో రెండవ చిత్రం ప్రారంభం మవుతుంది. దేవుల నాకు అదృష్టం గురించి దైవ మహాత్మ్యాల గురించి బాగా నమ్మకం ఏర్పడి పోయింది. విఘ్నేశ్వరుడు పాలు సేవించే సంచలనమైన వార్త వెలిసిన రోజున నేను పరీక్షించకుండా ఉంటానా?" అంటూ జయచిత్ర ఇలా చెప్పసాగింది "పాలు పెద్ద స్పూన్‌తో గణపతి విగ్రహం నోటి దగ్గర వుంచానంది. క్షణంలో స్పూన్ ఖాళీ. అది మహిమ కాక మరేమిటి? భక్తి ప్రపత్తులతో వినాయకుడ్ని పూజించాను. ఇలాంటి మహాత్మ్యాలను కళ్ళారా చూస్తూంటే కాదనగలమా?"

## "సహనం"

టైటిల్ గురించి డైరక్టర్ పి.ఎన్. రామచంద్ర రావు చెప్తూ, "ఉద్యోగాలు చేసే మహిళలు ఎదుర్కొనే సమస్యలకు అద్దం పడుతుంది చిత్రం" అన్నారు. ఊహ, ఆనంద్, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, ఎ.వి.ఎస్ బాబూ మోహన్ పాత్రధారులు.


**జమీన్‌రైతు**

సంవత్సర చందా రూ. 100/-
అర్థ సంవత్సరం చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products Ltd. Nellore


## నెల్లూరు ప్రి.డి.ము. కోర్టులో

E.P. No. 291/85
O.S. No. 1163/81

పిన్నంరెడ్డి రమణారెడ్డి -వాది
Vs
నెల్లూరు శివారెడ్డి -ప్రతివాది

### వేలం ప్రకటన

ప్రతివాది తాలూకు షెడ్యూలు స్థిరా ... 18.12.95 తేది ఉదయం 10 30 గంటలకు పై కోర్టులో వేలం వేయబడును. పాటదారులు ... పాట పెట్టుకొన వచ్చును.

### షెడ్యూలు

నెల్లూరు డిస్ట్రిక్ట్ రిజిస్ట్రేషన్ నెల్లూరు సబ్ రిజిస్ట్రేషన్ నెల్లూరు తాలూకా పాతు మోపూరు గ్రామము.
60 అంకణముల ఖాళీ స్థలములో 4 1/2 అంకణముల మిద్దె ... మరియు 2 1/4 అంకణముల వెనుక వరండాకు హద్దులు.
తూర్పు: దేవిరెడ్డి గోపాలరెడ్డి మిద్దె యింటి గోడ; దక్షిణం: పబ్లిక్ రోడ్డు, పడమర: పబ్లిక్ రోడ్డు; ఉత్తరం: దేవిరెడ్డి గోపాలరెడ్డి గోడ కొంత వరకు మోపూరు రామిరెడ్డి గోడ కొంత వరకు ప్రతివాది తాలూకా 3 అంకణముల స్థలము.

వాటి విలువ రూ. 10,000/-
జమీనా విలువ రూ. 11,000/-
E C. Nil

R.V. Ramamurthy
N. Satyanarayana
Decreeholders Advocates